# చలం ఆలోచనలు

(చలం మ్యూజింగ్సునుండి ఏర్చికూర్చినవి)

## ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

CHALAM AALOCHANALU
SELECTIONS FROM CHALAM MUSINGS
By Chalam

© YUVABHARATHI, SECUNDERABAD-500 003.

యువభారతి

ప్రచురణ : 36
ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200
23 నవంబరు, 1975

ముఖచిత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాన్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

వెల : 2-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES
YUVABHARATHI IS GRATEFUL



# మా మాట

ఏ సిద్ధాంతాన్నైనా గుడ్డిగా నమ్మేవాళ్ళకు, ఆసిద్ధాంతం ఎందుకు పుట్టిందో, ఏకాలంలో, ఏ పరిస్థితుల్లో, ఎలాంటివాళ్ళు లేవదీశారో వివేచించే వాళ్ళను చూస్తే కడు పుడుకు. ఇలాంటి వివేచనలు చేసే వాళ్ళకు సమకాలీనుల్లో మిత్రులకంటే శత్రువులే ఎక్కువుంటారు. ఆ శత్రువులుకూడా లోలోన మెచ్చుకుంటూనే పైకి గంభీరంగా వ్యతిరేకిస్తుంటారు. ఎందుకంటే కొత్తభావాలను మెచ్చుకొనేందుకు ధైర్యం ఉండాలె. సొంతలాభం కొంతైనా మానుకోగలిగే త్యాగం ఉండాలె. గుడిపాటి వెంకటచలంగారు ధూమకేతువులా దాపురించారన్నారు కొందరు. ధూమకేతువును అప్సరసచేతిలోని కలువపువ్వన్నాడు గురజాడ. ధూమకేతువు అందమైందనడానికి హేతువాదం జీర్ణం అయి ఉండాలి. చలంగారు సాహిత్యసృష్టికి ఒక కొత్తవస్తువును ప్రసాదించినవారు, ఒక కొత్తవచనశైలితో వ్యావహారిక భాషను అలంకరించినవారు. గుండెల్లో గూడు కట్టుకునే భావాలను అందించగలిగే సజీవభాషను అవలంబించినవారు. గొప్పవాళ్ళ ఆలోచనలను సమకాలీనులందరూ ఎన్నడూ సమాదరించరు. నలుగురితో నడిచే వాడు ఎప్పుడూ నడిపించేవాడుకాదు. చలం ఆలోచనారీతుల జాడలు ఇటీవల వెలువడిన నవలల్లో, కథల్లో, కవితల్లో కనిపిస్తాయి. ఎందరినో ఆయన ఆలోచనలు రచయితలుగా తీర్చిదిద్దినవి. చలంగారిని చదువకుండా ఆధునిక సాహిత్య మర్యాదలను అర్థం చేసుకోలేము.

స్త్రీల సమస్యలపట్ల ఇప్పుడు మనకు కనిపిస్తున్న జాగృత భావాలకు చలంగారు దోహదం చేకూర్చినారనడంలో సందేహం ఉండడానికి వీలులేదు.

తమ "మ్యూజింగ్స్" లోంచి కొన్నింటిని ఏర్చికూర్చి ప్రకటించు కోడానికి అనుమతించిన శ్రీ చలంగారి ఔదార్యాన్ని, సాహిత్య ప్రణయాన్ని, మేమెన్నటికీ మరువలేము

ఈ పుస్తకానికి పీఠికను సమకూర్చిన మా ప్రధాన సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి ఆదర పురస్సరంగా అభినందనాలను సమర్పించు కొంటు న్నాము.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి హార్దికంగా, ఆర్థికంగా చేయూతనిచ్చి, ఉత్తమ సాహిత్య ప్రసరణంవల్ల సమాజంలో సామరస్యం వికసించి, ప్రజాస్వామ్య భావాలు వేళ్ళుతన్నుకుంటాయనే యధార్థాన్ని నిరూపిస్తారని ఆశిస్తున్నాము,

ఇరివెంటి కృష్ణమూర్తి.



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌంద ర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్య క్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 35 ప్రచురణలను ప్రచురించి రెండులక్షలఇరవైఐదు వేలకు పైగా ప్రతులను సాధ్య మైనంత తక్కువవెలకు తెలుగు పాఠకులకు అందించడానికి పూనుకున్నది.

యువభారతి సాహితీ మిత్ర పథకంలో లోగడ దాదాపు ఎనిమిదివేల మంది సభ్యులుగా ఉండేవారు. గత డిసెంబరు 1 నుండి కొత్తరూపు దిద్దుకున్న యీ ప్రణా ళికలో ఇప్పటికి దాదాపు 3,300 మంది సాహితీ మిత్రులుగా చేరారు. పాత సాహితీ మిత్రులు కూడా ఈ పథకంలో చేరి రానున్న ఉగాదినాటికి ఈసంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్యసాధనలో తోడ్పడండి. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింప బడిన శాశ్వతజీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందలకు పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఈ పథకాలలో సభ్యులుగాచేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించు కోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివ రాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారిసౌహార్ధం, భాషాప్రియత్వం- ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి

23-11-75 అధ్యక్షుడు

# చలం - మ్యూజింగ్స్

అందరికీ అర్థమయ్యే భాష వ్రాసినా ఏకొందరికో అర్థమైన అపూర్వవ్యక్తి చలం. స్పందించే అంతరాత్మ ఆలోచనాతరంగాలుగా ఆయన శబ్దాల్లో నినదిస్తుంది. అందుకే చలం రచనలు చదువుతుంటే మనిషి కనపడకుండా మనసు మాట్లాడుతున్నట్లనిపిస్తుంది; నీటిబుగ్గ నిలువెత్తున లేస్తునట్లుంటుంది. చలం వచనశైలి కున్న జీవశక్తి నభూతో నభవిష్యతి. ఆయనమాట కాశక్తి ఆయనవేదనలోనుంచి పుట్టింది. అది ఒక్కనాటిది కాదు. కొన్ని దశాబ్దాల మూగవేదన; సంవత్సరాల తరబడి జీవితసమస్యల్లో సత్యంకోసం చేసిన అనంత అన్వేషణ!

ఒకజాతిలో రవ్వల్లాంటి రచయితలు కోకొల్లలుగా వెలుగుతుండవచ్చు; కాని రత్నంలాంటి అన్వేషకుడు నూటికికోటికి ఏఒక్కడో ప్రకాశిస్తుంటాడు. అన్వేషకుడు యోగి కావచ్చు; భోగి కావచ్చు; కవి కావచ్చు; కళాకారుడు కావచ్చు; వక్త కావచ్చు; ప్రవక్త కావచ్చు. ఏమైనా అతని జీవితం అనుక్షణల ఆత్మపరీక్ష; సత్యాన్వేషణలో అడుగడుగునా అగ్నిపరీక్ష! సామాన్యంగా అన్వేషకులు రెండు రకాలు-ఆలోచిస్తూ అన్వేషించేవాళ్ళు, జీవిస్తూ అన్వేషించే వాళ్ళు. ఆలోచిస్తూ అన్వేషించేవాళ్ళు బుద్ధికి దర్శనాన్నిస్తారు; జీవిస్తూ ఆలోచించేవాళ్ళు మనస్సుకు స్పర్శనాన్నందిస్తారు. ఒకరి దర్శనం జీవితానికి శక్తిప్రసారాన్ని ప్రసాదిస్తే మరొకరి స్పర్శనం రక్తప్రసారాన్ని కల్పిస్తుంది. ఒకటి విద్వత్తులా వెలుగును ప్రకాశింప చేస్తే మరొకటి విద్యుత్తులా చైతన్యాన్ని ప్రవహింప చేస్తుంది. తెలుగులో తిక్కన్న వెలుగును విరజిమ్మితే వేమన్న విద్యుత్తును సృష్టించాడు. ఒకరు జాతిని బోధించారు; మరొకరు శోధించారు! మధ్య యుగంలో ఉన్న వేమన్నలాగా మనమధ్య ఉన్నఅన్వేషకుడు చలం. ఆయన పద్యంలో పలికితే ఈయన గద్యంలో పలికాడు. అంతే. వీరిద్దరూ జీవితంలోని బాధను క్రమంగా లోతుకు దిగి చవిచూచినవారే; వేదనను వేడిగా పలకటానికి ప్రయత్నించినవారే. వారికి జీవిత మందించే అనుభవం ఆజ్యం, వారి రచన అగ్నిహోత్రం. చలం మాటల్లోనే వినండి- "మొదట్లో నాకూ, సారస్వతానికీ సంబంధంలేదు. నేను చూస్తున్న అన్యాయాల వల్లా, ఘోరం వల్లా నేను మండి పోయాను. ఆమంట నాలో ఇమడక కథ అయింది. నే నో రచకుణ్ణి కావాలనే ఆశ లేదు. నేను రాసిందానికి రసప్రపంచంలో ఓ విలువ వుందనీ తెలీదు. మొదటి కథనించి నాపాఠకులు బిగ్గరగా ఏడ్పులు ప్రారంభించారు.

ఆ ఏడ్పులే నా ఉత్సాహం. ఆ నెయ్యి నా మంటలో పడి భగ్గుమని ఇంకొక ధ్వని పుట్టించేది". చలం రచనలు ఆయన రక్త జ్వాలలు, ఆయన రక్తం ఆయన వేదన. ఆ వేదన అన్వేషణలోని సాధన: ఆయన స్వయంగా మండుతూ రచనల్లో వెలిగాడు:

చలం హృదయం తరతరాల స్త్రీ జాతి జీవితాంధకారాన్ని చూచి ఆక్రోశించింది. మగవాళ్ళ అమానుషకృత్యాలవల్ల చితికిపోయిన స్త్రీ వ్యక్తిత్వాన్ని ఉద్ధరించటానికి కంకణం కట్టుకున్నది. ఆడజాతి ఆర్తనాదాలూ, ఆవేదనలూ, అణగారిన ఆశయాలూ, పొంగారే కోర్కెలూ లోకానికి రచనల ద్వారా చాటి స్త్రీ స్వాతంత్ర్యానికై శంఖం పూరించాడు చలం. స్త్రీకి వ్యక్తి స్వాతంత్ర్యం కావాలన్నాడు. అంటే స్త్రీకి తనమీదా, తన శరీరంమీదా, జీవితంమీదా, హృదయంమీదా సంపూర్ణాధికారం కావాలని కచ్చితంగా వాదించాడు. ఆయన సృష్టించిన స్త్రీ పాత్రలన్నీ శిలలో నుంచి మేల్కొన్న చైతన్యాలే; చీకటిలో మండే జ్వాలా తోరణాలే. శశిరేఖ, దుర్గమ్మ, అరుణ, అమీనా-ఇలా ఎందరో సంఘంలో సభ్యతపేర జరిగే అన్యాయాలకు ఆహుతి అవుతూ, అగ్నిజ్వాలలా మండి ఆత్మాభిమానాన్ని వెలిగించుకున్నవారే. కామం పురుషుని జీవితంలో వలెనే స్త్రీ జీవితంలోకూడా బలమైన పాత్ర నిర్వహిస్తుందనీ, కట్టుబాట్ల అడక తెరలో అణగారిన కామం అంతఃకరణాన్ని అపవిత్రం చేస్తుందనీ, పావిత్ర్యం మనః పరిపాకంలో ఉన్నంత మడుగు వస్త్రాలలో లేదనీ నిర్భయంగా చాటాడు చలం. "పురుషునికి ప్రేమ ఆట గాని స్త్రీకి ప్రేమయే జీవనము. ప్రేమించినా స్త్రీ ప్రేమించుపానికిని తనకును శాశ్వతమగు బంధము కలదని తలచును. తన కిష్టము లేని పురుషుని స్త్రీ తిరస్కరింప వచ్చును, కాని, తనను ప్రేమించినందులకై అతనియెడ ప్రేమ చూపక మానదు. పురుషుని స్వభావ మట్టిది కాదు. తన యిష్టము తిరుగగనే పూర్వము నంతను మరచి పోవును. స్త్రీ యొకని ప్రేమించుచు యింకొకనితో కాలము గడపగలదు. కాని, పురుషు డట్లు సులభముగ చేయజాలడు" ఈ మాటలు స్త్రీ పురుష స్వభావాలలోని సత్యాలైనప్పటికీ వివాహవ్యవస్థకు వెన్నుపోటులుగా కనపడతాయి. కాని, ఆ వ్యవస్థలోని పరమార్థం లోపించిందని చలం ఆవేదన. బాహిరమైన ఆచారాల వెనుక జీవితాల విలువలు బలి ఔతున్నాయని ఆయన ఆక్రందన: కాలం ఆయన కలంలోని బలాన్ని గుర్తించింది. సంఘంలో స్త్రీ తన నైతిక బలాన్ని, మానసికవికాసాన్ని పుంజుకున్నది. చదువుతో పాటు సంస్కారం స్త్రీలో జంటగా పెరగాలన్న చలం మాట సాహిత్యంలో ఒక క్రొత్త యుగాన్ని సృజించుకొన్నది చలం స్త్రీ పాత్రలు చేసిన 'రెబెల్'కు సాహిత్య జగత్తులో మొదట కలవరం వ్యాపించినా, రచయిత సిన్సియారిటీ ఆయన రచనలకు తులలేని విలువను ప్రసాదించింది.

చలం అన్వేషణ స్త్రీ పొందే అతిదీనస్థితినుంచి ఆధ్యాత్మికౌన్నత్యం వరకూ సాగింది. పురూరవ నాటకంలో శిఖరాన్ని అందుకున్నాడు చలం ఆయన వ్రాసిన కథలూ, నాటకాలూ, లేఖలూ, అన్నీ సత్యాన్ని అన్వేషిస్తున్న ఆయన మనోనేత్రాల ఉన్మేషాలే. మ్యూజింగ్స్ ఆయన భావవిహంగాలకు అమరిన మ్యూజికల్ వింగ్స్।

అన్వేషకుడు నిజాన్ని నిర్మొగమాటంగా చెపుతాడు, నచ్చని దాన్ని నిష్ఠురంగా నిందిస్తాడు, అనుభవాన్ని ఆర్ద్రంగా పలుకుతాడు, అందుకో లేని దానికై అర్రులు సాచి ఆక్రందిస్తాడు. అతడు రచయిత అయితే ఆయన మనఃప్రవృత్తికి సాహితీ ప్రక్రియ ఒక ప్రవాహిక అవుతుందే కాని ప్రక్రియ కోసమై ఆయన ప్రవృత్తి పరిసీమితం కాదు. ఆయన నడిచిందే దానికి ఉరవడి; ఆయన నడిపిందే దానికి ఒరవడి. అన్వేషకుని రచనకు ఆకృతి శిల్పం ఔపచారికం. అందులో ఆయన అన్వయించే ఆలోచనే దానికి జీవం. అజీవం ఆయన సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా రూపొందింపజేస్తుంది. అందుకే శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు అన్నారు.–"కొందరి దృష్టిలో ఆయన గొప్ప కథకుడు, మరికొందరి దృష్టిలో గొప్ప నాటికారచయిత, మరికొందరి దృష్టిలో మహాకవి. కొందరు ఆయన్ని తాత్వికుడుగా భావిస్తారు. మరికొందరు సెక్సు రచయితగా. ఇది సమగ్రమైన సత్యం కాదు. చల మంటే ఒక ఉద్యమం. అప్పుడు కాని అర్థం కాదు".

చలంజీవితం పైకి చంచలంగా కనపడుతుంది. ఆయనకు జీవితం మీద చచ్చే మమకారం. అందిన అందాన్ని అనుభవించాలన్న ఆసక్తి ఉంది. అనుభవంలో పరిపూర్ణతను సాధించాలన్న పరితాపం ఉంది. జీవితానుభవంలో ఆయనకు పరిపూర్ణత లభించలేదు. ఎక్కడ చూచినా ఏదో లోపం; దాని వల్ల దుఃఖం; దానితో మనశ్శాంతి లేకపోవటం. శాంతికోసం చలం సౌందర్యాన్ని ఉపాసించాడు; ప్రేమను ఆరాధించాడు; నిజాయితీని అలవరచుకున్నాడు, నియమాలకు తలఒగ్గాడు, నీతిని నమ్మాడు, అనాథలకు ఆశ్రయమిచ్చాడు, నమ్మిన ఆదర్శాలకు నడుమువంచి కృషిచేశాడు, అన్యాయాన్ని ఎదిరించాడు, సౌజన్యాన్ని సమ్మానించాడు, సాహిత్యాన్ని సృజించాడు;చివరకు అరుణాచలాన్ని అధిరోహించాడు.ఆయన నాస్తికుడైనా, ఆస్తికుడైనా అన్వేషణకు ఆఅవస్థలను సాధనాలుగా మలచుకున్నాడు. చలం ఎన్నడూ అచలంగా ఉండలేదు, పరిపూర్ణానుభూతికై పురోగమనం సాగించాడు. రమణాశ్రమంలో వెలుగు కనిపించింది, నేడా వెలుగును విశ్లేషిస్తున్నాడు చలం. వెలుగు మెరిసినప్పుడెల్లా యెదద ఝల్లు మంటుంది; అందులోని 'సుధ' జాలువారుతోంది; గీతాంజలులూ యశోదాగీతాలూ భక్తిరసతరంగా

లుగా కురంగలిస్తున్నాయి. ఆత్మవేదనగా ప్రజ్వలిస్తున్నాయి. చలం ఎప్పుడూ ముందుకు పోయే బాటసారి. ఆయన జీవితం ఒక Pilgrims progress.

తెలుగుసాహిత్యంలో ప్రేమలేఖలు, మ్యూజింగ్స్- అన్న ప్రక్రియలకు రూపకల్పన చేసిన రచయిత చలం. అత్మాశ్రయ నవలా ప్రక్రియలో ప్రేమలేఖల రచన విశిష్టశిల్ప మార్గంగా విమర్శకుల మన్ననల నందుకున్నది. ఇక మ్యూజింగ్స్-వచనంలో సాగే ముక్తక సంపుటిలాంటిది. మ్యూస్ అంటే కళాసరస్వతి. మ్యూజింగ్స్ అంటే-'నిశ్శబ్ద సమాధిలో నిరంతర చింతనం! చలం మానసిక సమాధిలోనుంచి సముద్ర వీచికల్లా పొంగిన ఆలోచనా తరంగాలు! మ్యూజింగ్స్. ఇవి ఆయన అంతరాత్మ ఆలపించిన డివైన్‌సాంగ్స్. ఛందస్సుల కతీతమైన మ్యూజికల్ రైమ్స్!

ఇవి ముక్తి నిచ్చే భక్తి వచనాలు కావు; జీవితాన్వేషణలో దొరికిన సుఖ దుఃఖాల సుక్తి మౌక్తికాలు! ఈమౌక్తికహారంలో అంతస్సూత్రం చలం. మూజింగ్స్ చదివితే చలాన్ని చదివినట్లే. మిల్టన్ మాటల్లో చెపితే- ఈ గ్రంథం 'the Precious life-blood of a master spirit".

హైదరాబాదు,
23-11-1975

జి.వి. సుబ్రహ్మణ్యం

# చలం ఆలోచనలు

కవిత్వానికి జీవితానికి యేమిటి సంబంధమని ఎన్నేళ్ళమట్టో తర్కం. ఉన్నదని కొన్నాళ్ళు, లేదని కొన్నాళ్ళూ! నాలో చూసుకుంటే నా జీవితానికీ, నా వ్రాతలకీ. ఎంతో కలియక కనపడుతుంది నాకు. నాతో నా వ్రాత మారుతుంది. నా కలలు, నా ప్రేమలు, నాఆశలు, నానిరాశలూ, అన్నిటినీ పాడుతుంది - నా కలం. ఒకప్పుడు శ్రావ్యంగా, ఒకప్పుడు కఠోరంగా! కాని నా మిత్రులలో గొప్పకవిత్వం వ్రాసేవారి జీవితాలకీ ఆకవిత్వం ఆశయాలకీ సంబంధం కనపడదు నాకు. వారికి కనపడుతుం దనుకుంటాను; ఎవరికి వారికి, ఏమి వ్రాస్తేనేం? వ్రాతలు వెనక్కి చూస్తేనేం, లేక ప్రస్తుతం ప్రతిఫలిస్తే నేం? హృదయంలోనుంచి వొచ్చిందా? వుత్త చమత్కారమా? అనేదే ముఖ్యం. జీవితానికి అనుగుణ్యంగా వుందా? లేకపోతే ఈ వ్రాతలు వుత్త పైమెరుగా? జీవితం అనుగుణ్యంగా వుండనక్కరలేదా? ఒక రన్నట్లు వ్రాతలు - ఒక మూడ్ (Mood) లేక Highest moments of inspiration ఇన్స్పిరేషనా? తక్కిన జీవితం అధమమైనా, ఏ పూర్వ సంస్కారాన్నించో ఉత్తమకావ్యం కలగవచ్చా! ఏ రసికత్వమూ లేనివాడు ప్రేమకావ్యాలూ, ఏధీరత్వమూ లేనివాడు ఆదర్శకీర్తనలూ, అల్పాత్ముడు ఉత్తమ ఉత్సాహాలూ కల్పించగలడా? ఏ మంత్రి పెళ్ళిసమయమో వచ్చేటప్పటికి ఒకకవి డోలూ, ఒకకవి బూరా వూది కూడా దేశాన్ని నూతన ప్రపంచాలకి ఉదారఆశయాలకి స్వేచ్ఛావీధులకీ రక్తసాగ్రవాలకి ఆకాశవిహారాలకి ఆంధ్ర పౌరుషాలకి పురిగొల్పగల శక్తుల్ని కలిగి వుండగలడా? ఇదీ నా సమస్య!

ఎందుకంటే మృతకవుల జీవితాలు, నిజమైన కవులవి పరిశీలిస్తే; ఏదో గొప్ప "స్ట్రగుల్" ఒక తిరుగుబాటు, జీవితంలోనే ఒకఆదర్శప్రయత్నం ఇట్లాంటివి కనబడుతాయి. శ్రీనాథుడూ పోతన్నా తీసుకోండి; కీట్సు, షెల్లీ, బైరన్, వర్డ్సువర్తు, బ్రౌనింగ్, D. H. Laurance, మొదలైనవాళ్ళని వొదిలి. పోతన్నకన్న శ్రీనాథుడు నూరురెట్లు ఎక్కువ చక్కగా వ్రాసాడు. కాని ఆత్మ సంతుష్టికీ, - భక్తిసంగతి మాట్లాడటంలేదు - ఆత్మ ప్రోత్సాహానికి పోతన్న పలకవలసిందే!

కవిత్వానికి(కవిత్వమంటే వ్రాతలన్నీ)కవికి దీపానికి కాంతికి వున్న సంబంధం అనుకుంటాను. అన్ని తేజస్సులూ, వికారాలూ, మాలిన్యాలూ, దీపంలోవున్నవన్నీ

కాంతిలో కనబడతాయి నిర్మలదృష్టి కలవాళ్ళకి. కవిత్వమేకాదు, అద్భుతమైన కంఠమూ, మంచి చాతుర్యమూ, విద్యా కలిగి కూడా ఆత్మలోకి పలకలేని కవులూ గాయకులెందరో యీ ఆంధ్రదేశంలో! పేర్లు చెప్పానా సంగీతం తెలీదనీ, ఆంధ్రాభిమానం లేదనీ అంటారు. ఆత్మతో మాట్లాడగల శక్తి కావాలంటే వ్రాతలోంచి గాని పటాల్లోంచి గాని సంగీతంలోంచి గాని అసలు "సోర్సు"లో జన్మస్థానంలో ముందు ఆత్మ మాధుర్యం వుండాలి. కళలకైనా ఆత్మ విద్యే ప్రధానమేమో! ఎందుకంటే ఏమి చేసినా, ఏమి వ్రాసినా, ఏమి పాడినా, ఆత్మానుభవం నుంచి ఎట్లా తప్పించుకోగలరు? ఎంత గొప్పగా పాడగలిగినా త్యాగరాజు కీర్తనని నాబోటివాడు యితరుల లోకి పలికించగలడా రామభక్తి గలవాడే-పరికించగలడు కాని? ఆ emotion తెచ్చుకోగలవారు, రంగంమీది నటకుడివలె తెచ్చుకోగలవారున్నారు ఏ షేక్స్పియరో తప్ప తన అనుభవాన్ని మీరి యితర పాత్రల్ని తాను యెరిగినట్టే చిత్రించగల జీనియసులు అరుదు. నేను ఎక్కడన్నా స్త్రీ పాత్రని స్వభావసిద్ధంగా చిత్రించినా అట్లాంటి స్త్రీని ఎరుగుదును గనక ఆమెతో బాధలు పంచుకున్నాను గనక. కాని ఎవరో అసామాన్య ప్రతిభావంతులు గొప్ప జీనియసులు స్త్రీతో పరిచయం లేకుండానే స్త్రీ హృదయాన్ని గురించి అద్భుతంగా వ్రాయవచ్చు. అది inspiration కావొచ్చు లేక తన ఆత్మతో విశ్వం ఆత్మని అందుకోవడంవల్ల కావొచ్చు, లేక పూర్వజన్మ సంస్కారం వల్ల కావొచ్చు. ఏదో అన్నినో లేక అన్నీ వొకటేనో నాకు తెలియదు. జీనియసుల్ని అట్లావుంచి సామాన్యచిత్రకారులు అనుభవంమీదనే తమ జీవితనిర్ణయాల మీదనే ఆధారపడాలి, రసజ్ఞానంకోసం. అందువల్లనే జీవితానికీ కళకీ సంబంధం తప్పదు. జీవితాన్ని మీరి వ్రాయగలవారు యుగపురుషులు. నాసోదరకవులు తాము యుగకారుల మంటే నేను మాత్రం కానని మాత్రమే అనగలను.

జీవితమంటేనే struggle. ప్రతిపదార్థమూ ఉన్నతదశని పొందాలని పెనుగులాడుతూ వుంటుంది. అణువు దగ్గిర్నుంచి గడ్డినించి అన్ని జీవులూ క్రమంగా ఇంద్రియాలలో బుద్ధిలో పరిణామాల్ని పొందుతున్నాయి. మానవజాతిలో కూడా మనుషులు అడివిమనిషినుంచి వృద్ధిపొంది బలం బుద్ధి ఆత్మ వికసించుకోడానికని నిరంతర ప్రయత్నములో వున్నారు. ఈ inner propulsion వల్లనే మానవులు ధనంమీద స్త్రీలమీద, కళలమీద ఆశపడి తృప్తిపొందాలని చూస్తారు. ఎవరిలో యీ బాధ యీ struggle ఆగిపోతుందో వారు నిర్జీవులు. ఈ ప్రయత్నబలం యెక్కువగా కల వారిలో కొందరు తమ అనుభవాన్ని కళారూపాన్ని వెలువరిస్తారు. పాడాలనే ప్రోద్బలం

వొక్కటి analyse చేసి చూచుకున్నా అర్థమౌతుంది యీ విషయం. కనక వున్నతమైన కళ యెప్పుడూ మానవుడు ఔన్నత్యాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాన్ని ప్రతిఫలిస్తుంది. అందువల్లనే జీవితంతో సంబంధం కలిగివుంటుంది. ఎప్పుడూ మార్పును సూచిస్తుంది. ఎందుకు జీవితమంటే ప్రవాహం, ఎప్పుడూ మారేస్వభావం కలదిగనక. జీవనశక్తి అదే. సృష్టిశక్తి, యెక్కువగా వున్నవాడు గాని యితరుడు గొప్పకళాశక్తి గలవాడు కాలేడు. అందువల్లనేనేమో స్త్రీశక్తి యెప్పుడూ ప్రోత్సహించే శక్తిగానే వుంటుంది. achieve చేసేది పురుష శక్తి. ఇంతవరకు తమ స్వార్థంగా కాక యితరంగా యేదో ఒక cause 'కాజ్' తనదిగా చేసుకొని ప్రయత్నించనివాడు వ్రాయవచ్చు గంపెడు పుస్తకాలు-కాని కళా వాతావరణంలో వాటికి చాలా తక్కువ విలువ వుంటుంది. తమ జీవితాల్ని అంటక, కళకి యేదో విషయం కావాలి కదా అని తెచ్చిపెట్టుకుని వ్రాసేవారు చాలామంది. ఆ కారణంవల్లనే సుఖమైన పెళ్ళి, చక్కని వుద్యోగం, మర్యాదా, అధికారమూ-చాలామంది ఆంధ్రకళాకారులకి ఆత్మహత్యా కారణాలవుతున్నాయి.

ఈ సూత్రాల్నిపట్టే యేదోవిధంగా వున్న పరిస్థితులకి యెదురీదనివాడు, ఎక్కడో సంఘంతోనో ప్రజలతోనో విరోధం కల్పించుకోనివాడు గొప్ప కళను - సృష్టించలేడు. చాలామంది యిదివరకు ప్రచారంలోవున్న అభిప్రాయాల్నే మళ్ళీ యేకరువు పెడుతూవుంటారు. మన ప్రబంధకవులూ ఇంకా యీనాడు మళ్ళీ భారతాలూ, రామాయణాలూ వ్రాసేవారు ఉదాహరణాలు. అసలు లోకంలో మెళుకువ చాలామందికి రాదు. వాళ్ళకి వృద్ధి క్షయాలులేవు. వాళ్ళ కళా అంతే, ఒక సున్నాలో చెప్పిందే చెప్పిందిగా ఒకభావం యిటూ అటూ తిప్పుతో వుంటారు.

రొమెయిన్ రోలెండు క్రిష్టఫర్‌లో ఏం రాశాడంటే —

So many men-they have no opinions except in so far as they disapprove of all enthusiastic opinion. But if a man is to be independent, he has to stand alone, and how many men are there, who are capable of that ? How many men are there even amongest the clearsighted who will dare to break free of the bondage of certain prejudices, certain postulates which cramp and fetter all the men of the same generation ? That would mean setting up a wall between themselves and others on the one hand freedom in the wilderness, on the other, mankind. They do not hesitate. They choose mankind the herd. The herd is evil-smelling, but it gives warmth.

Then those who have chosen pretend to think, what they do not in fact think. It is not very difficult for them. They know so little what they think! "Know thy-self" How could they, those men, who have hardly a *me* to know. In every collective belief, religious or social. Very rare are the men who believe, because very rare are the men who are men. Faith is a heroic force, its fire has kindled but very few human hearts.

ఉత్సాహం గలవాళ్ళ అభిప్రాయాలు తప్పనడం తప్ప యింకో అభిప్రాయాలుండవు, చాలామంది మనుషులకి. స్వతంత్రంగా యోచించి అనుష్ఠించాలంటే ఏకాకి ఐ నుంచోవలసివస్తుంది. ఆ శక్తి యెంతమందికి వుంది? బాగా జ్ఞానం కలవారుకూడా ఆచారాల్ని, సామాన్య అభిప్రాయాల్ని యీనాటి సంఘాల్ని సంకెళ్ళువేసి బిగదీసే అబద్ధాలని ఎదిరించగలవా రెందరున్నారు? ఎదిరించారా లోకానికి తమకీ మధ్య గోడ కట్టుకుంటున్నారన్నమాటే. ఒకవేపు ఎడారిలో స్వేచ్ఛ, రెండోవేపు మనుష్యజాతి, ఏమంటున్నా సంకోచించరు.మనుష్యజాతిలో గుంపుతో చేరిపోతారు. గుంపులో చెడువాసనలు-కానివెచ్చగా సురక్షితంగా వుంటుంది ఇట్లా మనుషుల్లో కలిసిపోయి ఏదోగొప్పగా ఆలోచిస్తున్నట్టు సమర్థించుకుంటో నటిస్తారు. నిజం-అసలు ఆలోచనాశక్తి గాని ధైర్యంగాని లేదు. ఉన్నట్టు నటించడం సునాయాసం వారికి వారే మాలోచిస్తున్నారో వారికి తెలీదు. "నిన్ను నువ్వు తెలుసుకో"! ఎట్లా తెలుసుకుంటారు? తెలుసుకోడానికి వాళ్ళకి ఒక నేను అనేది వుంటేగా! ఏ ఆచారంలోనైనా, మతంలోగాని సాంఘికంగా గాని అసలు విశ్వాసం కలవారు తక్కువ. ఎందుకంటే అసలు మనుషులనతగ్గవారే తక్కువ గనక. విశ్వాసం చాలా తీవ్రమైన శక్తి. దాని అగ్ని చాలా కొద్ది మనుష్యహృదయాల్నే రగిల్చింది.

## 2

గొప్ప కావ్యం వ్రాయాలంటే పదాలుకాదు, సమాసాలుకాదు, వ్యాకరణంకాదు కావలసింది ఆత్మ ఔన్నత్యం, struggle, rebellion - ఈ పండితులకి నవీన ప్రపంచ వాఙ్మయంతో ఓనమాలురావు. పుస్తకాలన్నీ కఠినపదాలలో నింపి కళ్ళు చెదర గొట్టాలని చూస్తారు. పాత తెలుగు వాఙ్మయము మల్లేనే పుస్తకమంతా కలిపితే నాలుగు కొత్త అభిప్రాయాలు ఉపకరించేవి. Thought provoking ideas కనపడవు. ఊరికే భాషామార్దవంలో భారంతో మూల్గుతాయి గ్రంథాలు-బ్రతకవు, చలించవు వుద్రేకించవు.

## 3

కవి తన కల్పనలలో, లోకాన్ని అందాలతో నింపుతాడు. అందాలు దొరక్క కుళ్ళిపోయే జీవితాలకి, విశ్వతేజాన్ని వ్యాఖ్యానంచేసి సుందరమైన పాతాల కిందమార్చి తోవచూపి ఉద్ధరిస్తాడు. పాతశతకాలలో వ్రాసినట్టు, మబ్బులవలె, నదులవలె, చెట్ల వలె, కోవెలవలె ప్రతిఫలాపేక్ష లేకుండా. ప్రపంచ కఠోరశబ్దాలను అణిచే ప్రయత్నంలో తనకి తనమీదా తన ఆర్టుమీదా ఉండే అభిమానాన్నీ, లోకంమీద తనకి వుండే ప్రేమనీ, బాధనీ, తనపాటలో సమన్వయ పరచి సాఫల్యపడతాడు.

A true artist is always a lover.

ఈనాటి మనకవులు, చిత్రకారులు, పాఠకులు తమకి మామూలు జీవనాధారాల్ని నిరాకరించే దేశంలో, తమ కళని వెలిగించుకునే బతుకుపీలుకై, వేరేఉద్యోగాలుచేస్తో, ఏ అవసరమూ ఆదరమూచూపని ప్రజల కళ్ళముందుగుర్తుని వాంచిస్తో, పడే శ్రమ ఎంత విషాదం. కాని తలచుకుంటే నాకు ఎంత గర్వము! ఏంవ్రాస్తున్నాడు? ఏంఉపయోగం? ఎవరికాక్కవాలి? వ్రాసేదాంటో ఎంత రసంవుంది? ఎంతవిలువవుంది? అన్నేప్రశ్న గట్టిగా రానక్కర్లేదు. అతని ఆశ, అతని ప్రయత్నం, అతని ఉద్దేశ్యం, అంతే కావల్సింది. ఎంత తాను లోకాన్ని తిట్టనీ, ద్వేషం చూపనీ, తన సృష్టి సమయాల్లో, ఆర్టిస్టుకి లోకం ప్రేయసి. ఆహానికి లోకానికి భేదంలేదని తిరిగి తిరిగి రూఢి చేసుకుంటాడు కళాకాలి. గొప్పగాపాడే సమయాన గాయకుడికి పాడే తనకూ, వినే ప్రజకూ భేదం కనిపించదు. ఎంత పోట్లాటలో స్త్రీద్వారా పురుషుడు సృష్టిప్రయత్నం చెయ్యని ఏమూలో ఆనందమూ ప్రేమా కలక్క తప్పవు ఆ నిమిషానికైనా.

ఎవరికీ కాకపోయినా, కల్పించడమనేది కవికి ఆనందం. ఇతరులు తన కల్పనని అనుభవించడమూ అతనికి ఆనందమే; అనుభవించి, భరించలేక, తననితిట్టినాసరే అందుకనే నష్టపడికూడా, పుస్తకాలు అచ్చువెయ్యడమూ, రికార్డులు ఇయ్యడమూ, బారువా వంటివారు ఫిల్ములు తియ్యడమూ, తన కల్పనానందాన్ని ఇతరుల మనసుల్లోప్రతిఫలింపచేసుకుని, తన అంద ప్రతిబింబం చూసుకొని, తన గాన ప్రతిధ్వనిని ఎదటివారి కళ్ళలో విని ఆనందిస్తాడు ఆర్టిస్టు. తనపాలు తాగే బిడ్డముఖంచూసి తల్లి పరవశత్వం చెందినట్టు ప్రపంచం తన కల్పనల్ని అంగికరించకపోయినా భవభూతిమల్లే, భారవిమల్లే యుగాలు ముందుకుచూసి కల్పించగలడు. ఎందుకంటే, కల్పనలలో వుండే ఆనందం అతన్ని ప్రోత్సహించి, ధైర్యమిచ్చి, ఓదారుస్తుంది.

నిజమైనఆర్టిస్టుకి తనలో తనకువుండేవిశ్వాసం ఇంకెవరికీ దేంట్లోనూ వుండదు. అతని కల్పన అతని మనసులోంచి కాదు పుట్టేది. జనులందరినీ ఏకంచేసే విశ్వ మేధస్సులో కుంచె ముంచి చిత్రిస్తాడు. గనక ఆనాడు జరిగే పద్ధతులూ అభిప్రాయాలు పైపొరలు, వాటిని చీల్చుకుని శాశ్వతంగా నిలిచేమానవత్వంలోంచి పలుకుతాయి అతని పాటలు. అతనికి లోపల తెలుసు. తాను సత్యం వ్రాస్తున్నానని, తనని అర్థం చేసుకునే శక్తి లేకా, అర్థంచేసుకుని వొప్పుకునే ధైర్యం లేకా, మొదటి ఆధిక్యతని వొప్పుకోడం భరించి ఎదట పడలేక అతను చెప్పే వాస్తవాన్ని తట్టుకోలేక, తాము గొప్పవనినమ్మి బతికే విలువల్ని చీల్చి చూపుతున్నాడనే కోపంవల్ల, తను చెప్పేసత్యం వాళ్ళలో పలుకుతున్నా, మాయపొరలు కప్పుకుని నటిస్తున్నా, అతనికి లెక్కలేదు. కాని ఏనాడో కవిగన్న కలలు వాస్తవం కాకపోవు. ఎందుకంటే ఏమూలో సృష్టికర్త కలల్ని పంచుకుంటున్నాడు అతను.

## 4

కళవెనక వుండే శక్తిసౌందర్యం. అది మానవుల ఏర్పాటుకి లొంగని శక్తి. గొప్ప artist ఎంత సౌందర్యాన్ని తాను స్వాధీనంచేసుకుంటున్నాననుకుంటున్నాడో అంతకన్న గొప్పగా సౌందర్యం అతణ్ణి వశ్యుణ్ణి చేసుకుంటోంది. అందుకనే యితర అధికారాలకి దాస్యం చెయ్యవలసివచ్చినప్పుడు అతనిలో ఆ బాధ, ఆ తిరుగుబాటు. దాసుడైనాడా అతనిలో పతనం.

'వైణికుడు శాస్త్రి సినీమాలో జీతానికి చేరాట్ట' అన్నారు లీల.

'ఎంతో ఘోరం' అన్నాను నేను.

'ఏం?'

'సినిమా వాతావరణం ఆత్మవినాశనం చేస్తుంది అన్న నాథియరీని అటుంచి... గొప్పకళాకారి, తనకళని దాస్యానికి ఉపయోగించడం, ఒకకట్టుబాటుకి వొప్పగించడం తలచుకుంటే నా హృదయం ఎదురు తిరుగుతుంది.'

'మరి ఆర్టిస్టు బతకడం?'

'అదే అనాదిగా వస్తున్న సమస్య; దిగులుపడతాం అంతే'

'పోనీ అంతకన్న ఏం చెయ్యాలి అతను?'

'పాటకచేరీలు, శిష్యుల్ని తయారు చెయ్యడం!'

'ఏం ఆ సినిమా వాళ్ళకి కావలసిందేదో, ఆ జీవితం విలువ వాళ్ళకిచ్చేస్తాడు. తన స్వంతప్రతిభ ఏమవుతుంది?'

'యింకోళ్ళ ఆజ్ఞలప్రకారం తన కళని వంకరతిప్పే అలవాటు, కళని ధనానికి దాస్యం చేయించే ఆ బానిసత్వం, క్రమంగా అతని ఆత్మలోకిపాకి, అతని జీనియస్‌ని స్వేచ్ఛని, ధైర్యాన్ని చంపేస్తుంది. అతని కళకి ప్రజాదృష్టి పడుతుంది. యింకజన్మకి తను కలలుకనే అందాన్ని అందుకోలేడు. అందుకనే లోకంలోని గొప్ప ఆర్టిస్టులందరూ స్వతంత్రులు. చాలావరకు దరిద్రులు. తనది కానిపని చెయ్యడంలో వుత్త వాళ్ళు పడేది పని బరువుమాత్రమే. ఆర్టిస్టు సాధారణమైన పనిని చెయ్యమన్నా నరాల్లో ఏదో ఎవరికీ అర్థంకాని బాధపడతాడు. కాని తనకళని వంకరతిప్పి అవసరాలకి సర్దవలసి వచ్చిన ప్పటిబాధ, తనశరీరాన్ని నలిపి వొంచి చెక్కపెట్టెలో ఆమర్చనున్నప్పుడుకూడా పడడు. గొప్ప జీనియస్ సంగతి మాట్లాడుతున్నాను. అందులో అతడు ఇదివరకు పాటలోలేని పద్ధతిని ఎక్కణ్ణించో పలికిస్తున్న creative genius అంటున్నారు. అంతేకాదు ... కూలికి అందాన్ని పలికించే ఆర్టిస్టుకి - తను స్వేచ్ఛగా ఎంచుకుని సౌందర్య రహస్యంలోకే వెతుకుతోవెళ్ళి ఎక్కడెక్కడివో రహస్యాలు పలికించేనేర్పు, విశ్వాసం, దృష్టి తక్కువవుతాయి. అందుకనే గొప్ప ఆర్టిస్టు ఎప్పుడో ఒకప్పుడు ఈ రెండు దోవల మధ్యనుంచుని ఆలోచించవలసిన గతి పడుతుంది. ఐశ్వర్యం సుఖం చవకకీర్తి, రెండోవేపున తన కళారాధననే యత్నం, అన్వేషణ, పేదతనం, అశాంతి, ఎవరికోతప్ప తాము అర్థంకాక పోవటం పోతన్నపద్యాలలో ఒక్కరవ్వ అతిశయోక్తి లేదు. 'పోతన్న' సినిమాలో అంత ఘోరంగా పాడించినా వాటినిజం చెడదు.

'ఒక గొప్ప ఆర్టిస్టు అమ్ముడుపోయినప్పుడల్లా ఆ దిక్కు వెలిగించే గొప్ప నక్షత్రం ఇక దిక్కులేకుండా క్షణికమైన గొప్పవెలుగుతో కిందికి జారినట్టుంటుంది. తనకళకి సంబంధించని పనినేదో చేస్తో తనను పోషించుకుంటో తనకళాన్ని గానాన్ని కాపాడుకునేవాళ్ళం నయం' అన్నాను.

సామాన్యమైన గుడ్డి అవిరళశక్తిని తన బానిసపని చేసుకోబోయి మానవుడు చాలా సులభంగా దానికి బానిసైనాడు. ప్రతి ప్రచారకుడు, మందులమ్మే అతనినుంచి మతప్రవక్త వరకూ, ఈసౌందర్యదేవతనే తమ ఉపయోగాలకి ఎరువు తెచ్చుకోచూస్తారు. ఏ కళ్ళాలకి లొంగని ఆ గుర్రాన్ని నీబండికి కట్టి బరువు మోయించావా, నీబండిని నీసామానుని ఏ గోతిలోకో తన్ని విపరీతమైన అంతరిక్షమార్గాన ఎగిరిపోతుంది. సౌందర్యారాధన లేంది ఏకళనీ సాధించలేవు. కళని ఆశ్రయిస్తేనే గాని ప్రచారంస్థిరంగా

సాగదు. నువ్వు నమ్మివున్న కళ ఎన్నటికీ నీసేవచెయ్యదు. సౌందర్యాన్నారాధించావా అది తన అనుచరుల్నీ ప్రేమనీ, దయనీ, భక్తినీ, విశాల దృష్టినీ, వీటినన్నిటినీ నీ జీవితంలోకి తెచ్చి నీ సంకుచిత యత్నంలో నీ విశ్వాసాన్ని చెదరగొడుతుంది. సౌందర్యశక్తిని, యే ఉద్ధృతంవల్లనో విపరీతమైన అదుముడులో యిమిడ్చి వుపయోగించుకున్నారా, ఆత్మలేని వికృతమైన రాక్షసుల్ని తయారుచేస్తుంది.

మనం చేసే యత్నానికి విరుద్ధమైన యత్నాలు చేసేవాళ్ళ యత్నాలు భంగపరచడం మానుషం. వాళ్ళబలాన్ని మనబలంవల్ల సాధించవొచ్చు. వాళ్ళ ప్రచారాన్నిమన ప్రచారంవల్ల ఎదుర్కోవచ్చు. కాని ఏ ప్రచారానికీ సంబంధించని విజ్ఞానం, మానవుడి మనో స్వేచ్ఛావిహారం, విశాలదృష్టి, కళ స్వతంత్రం, ప్రచారానికి విరోధి అయితే, ఆ ప్రచారం చాల అపాయకరమైనదా విధ్వంస శక్తుల్ని ఎరువుతెచ్చుకునేదీ అనడానికి ఏమాత్రం సందేహించనక్కరలేదు. కవి, గాయకుడూ, ఫిలాసఫర్ వీళ్ళకి స్వేచ్ఛ లేని దేశం కాలం ఘోరం. చాల త్వరలో మనుష్యులు, మరలూ కీలుబొమ్మలు, రాక్షసులూ, Robots గా తయారవుతారు. ఎప్పుడూ కార్యాలలో, ఆలోచనల్లో, యత్నాలతో, కలలతో, మనోవిశాలత్వంలో ప్రవహించవలసిన మానవశక్తి గుంటలో నిలిచి మురుగుతుంది. అనేకమైన రంగులతో, వెలుగుతో, నీడలతో స్వరాలతో, విరుద్ధాలతో, ఎదుర్కోళ్ళతో, నిజానికై, ఆదర్శాలకై పెనుగులాడే ఈ సృష్టి విజృంభణ బలవంతంగా ఆగి వుక్కిరిబిక్కిరౌతుంది. అందులోముఖ్యం అందాలకీ, శృంగారాలకీ, శత్రువులైన మనుష్యులు చాల త్వరలో అన్నివిధాల అంతరించిపోతారు. మనుష్యుడు పాడే స్వేచ్ఛాగీతాల్ని భరించలేని జాతి చాల త్వరలో తమ ప్రచారానికి తోడ్పడని ఆకాశాన్నీ, నీళ్ళనీ, చెట్లనీ, చాలా నిరుపయోగమని ఆలోచిస్తారు. కవిత్వం, కళా మనిషి దృష్టిని అనంతపదాల విహరింపచేసి మీరిచ్చే ఇరుకు శిక్షణ శిక్షనుంచి చలింప చేస్తాయనుకునేప్పుడు ఆకాశపు అగాధాలు, సముద్రపు దూరాలూ, పర్వతాల అనంత ఔన్నత్యాలూ తమకి విరోధంగా గమనిస్తారు. మానవుడి ఆకలీ, ధనమూ, తప్ప ఇంక విలువలులేని వాళ్ళు త్వరలోనే కీటకాల స్థితిలోనికి దిగుతారు. efficientగా పనిచేసే తేనెతుట్టలూ, చదలపుట్టలూ, వీళ్ళ ఆదర్శాలు.

ఎందుకీచెట్లు యిట్లా వృధాగా ఎదగడం, వీటిని ఏవో అక్షరాలక్రింద కత్తిరించి గొప్ప పరిచారం చేస్తే ! యీ మబ్బులమీద కాంతితో స్లోగన్లు వ్రాస్తే ! జంతువులకీ పక్షులకీ వొంటిమీద తారుతో ప్రమాణవాక్యాలు వ్రాస్తే ! ఏం చూస్తావు ? ఏ మనుభవిస్తావు ? విశాలంగా లోకాలన్నీ పరుగులెత్తే నీమనసుని చూసి నీకు అనుమానమైతే !

ఆకాశంలోకి నిదానించి చూస్తే దేవుణ్ణి వెతుకుతున్నావనుకునిపోతారని నీకు భయమైతే 'ఏమిటి యిదంతా?' అనే వున్నతమైన ప్రశ్నరావడమే సిగ్గయితే? మామూలు కాని దాన్ని సహించలేకపోతే? నీ జీవితాన్ని అర్పించి, నీరక్తంపోసి ముందు ప్రజలకి నువ్విచ్చే విలువలేమిటి, మనిషి వుత్తదేహం కాదనే సందేహాన్నే చేరనియ్యకపోతే? మనిషికి ఆత్మలేకపోవచ్చు, కాని వుత్త దేహాన్ని మనసునీకూడా మించింది అమూల్యమైనది ఏదో? దాన్ని అమ్ముడుపోతే నీ సుఖానికి ముందు వారి సుఖానికి? నీ స్వసుఖాన్నీ శాంతినీ ధారవోసి, అన్నిబాధలూ సహించి, అర్పణ చేసుకునే నీ జీవితపు ఉత్సాహమే నీ ప్రచారాన్ని అబద్ధ మబద్ధమంటోంది. 'మనిషి దేహసౌఖ్యం కోసం మనోశాంతికోసం మాత్రమే బతుకుతాడని?" నువ్వింత నిన్ను నువ్వు త్యాగం చేసుకుని సంపాయించి యిచ్చి సుఖంలో నీ సంతతివారు నిలుస్తారా? నిన్ను రేపిన ఉధృతం, అర్పణా, వాళ్ళుమాత్రం వాంఛింపరా? కొడుకులు సుఖపడాలని జీవితమంతా కూడబెట్టి యిచ్చిన ఆస్తులేమై పోతున్నాయో చూడు.

మానవజాతిని తను నమ్మిన పథాన నడిపించాలనే కోర్కె ఎక్కువై పోతోంది. ప్రాణ నాశనానికి భౌతికశాస్త్రాలు ఎట్లా విపరీతంగా సహాయంచేస్తున్నాయో, అటానే మనోబంధనానికీ ప్రచారప్రాబల్యానికీ మనోతత్వశాస్త్రం mob-psychology, psycho-analysis తోడ్పడ్డాయి. ఎట్లా చెపితే ప్రజలు నమ్ముతారో, మత్తులో పడతారో, ఉచ్చులో మునుగుతారో యీ శాస్త్రాలు విశదం చేసాయి.

అన్నిట్లోనూ గొప్పదాహం కళాదాహం. ఏ వుద్దేశ్యమూలేని గొప్పకళ యిచ్చే విశాలత్వం, జ్ఞానం, ఏ సందేశమూ, ఏ ప్రచారమూ చెయ్యలేవు. గొప్పకళ నుంచి ఎవరి సంస్కారాన్నిబట్టి, అవసరాన్నిబట్టి. వాళ్ళు తీసుకుంటారు. ఎంత తీసుకోవాలో నేర్చుకోవాలో మనం ఏరిచూపనక్కర్లేదు. ఏం చెపుతున్నామనికాదు కళ ప్రయత్నం ఎంత అందంగా చెపుతున్నామనికూడా కాదు, ఎంతరసం అనుభవించేస్తున్నామని. రసం కళలోని అమృతం. కాని ఉద్దేశ్యంలేని కళ వుత్తఅర్థంలేనిపని అవుతోంది. ప్రతివారికి (నాతో సహా) కళని ఉపయోగించుకుందామని ప్రయత్నమే.

సినిమాలూ అంతే...అందమైన కథా నటనా వుంటే చాలదుట. ప్రజలకి ఏదో బోధించాలట, కళలోని రసం కన్న గొప్ప సందేశం, ఏ మంచి ప్రజలకి? బోధనలు జీవితపద్ధతిని సంస్కరించ చూస్తాయి. నిజమైనకళ ఆత్మనే సంస్కరిస్తుంది. కాని ఆ సంస్కారం కంటికి కనబడదు. చూచి విలువకట్టలేము. సినీమా నిర్మాతల ఆత్మ పరిశుద్ధమయిందా, వాళ్ళదృష్టి కళమీదనే నిలిపారా, వారు నేను సందేశాన్నివ్వవలసిన

పనిలేదు. కళానుభవంకన్నా మానవుడికి గొప్పవిద్య లేనే లేదు. ఆధ్యాత్మికం అంటే ప్రపంచంలోని అందానికి ఆనందానికి కళ్ళుతెరవడం. పిపీలకం నుంచి ఆకాశం వరకూ ఆనందంతో నింపుకోగల శక్తినివ్వడం. ప్రజల ఆకలీ; దప్పి తీర్చేపద్ధతులు వేరు అందం యివ్వడమే కళకి ఉద్దేశ్యం. కళలో పాతా, కొత్తా, ముందూ వెనకా యివేమీ లేవు. విషయంకాదు ప్రధానం. రసాన్నిచ్చిందా కళ, యింక దీని ప్రయోజనమేమి టని అడగడం గుడ్డితనం. అంత ప్రయోజనకారి యింక వుండదు. గంతలు కట్టుకుని నువ్వు వాంఛించే ప్రయోజనాన్ని నెరవేర్చలేదు గనక, దానివల్ల ప్రయోజనం లేదనడం చాలా సంకుచితం. సంగీతం బాగా పాడితే మాటలేమిటని వెతకడం రసికుడు చేసే పనికాదు. ఎంత గొప్ప మాటలకన్నకూడా హృదయాన్ని కదిలిస్తుంది రాగం. విషయం లేకుండా అందాల్ని కల్పించగలదు కనకనే గానం కళల్లో కన్నిటికీ వుత్కృష్టమైనదయింది.

## 5

సంగీతంలో ఏది శ్రావ్యం, పాతకావ్యాల్లో ఏది ఉత్తమం, ప్రవర్తనలో ఏది నీతి; ఇట్లాంటివి కాలంలో నిలిచి ఏర్పడ్డాయి. కొత్తది ఏదివొచ్చినా చప్పున ఆవెనక నించి నిలిచిన విలువలతో పోల్చి కొలిచి కొత్తదాని విలువ నిర్ణయిస్తారు. కొత్తదానికి, బాగా కొత్తదానికి, పాతదాని కొలతలతో విలువలు నిర్ణయించడం అన్యాయమే. పాత విలువలే శాశ్వతమైనవైతే, ఏ మార్పూ, అభివృద్ధీ వీలులేనివౌతాయి. ఏది ఏ మనిషికి అందంగా ఆకర్షకంగా కనబడితే అది అతనికి విలువైనదనేమాట నిజమే. కాని విమర్శగా, జనసామాన్యం అంగీకారం కాలంలో నిలవడం, అనే సంగతి వొచ్చేటప్పటికి, పురాతనం నించి నిలవబడ్డ విలువలతో కొలత తప్పదు. ఆ విలువలకి నిలిచి కొత్తదనాన్ని గట్టిగా ప్రవేశపెట్టిన కళలు, అవీ కొన్నాళ్ళకి పాతవై నిలుస్తాయి. కాలంలో నిలకడ కావ్యానికి సరైన విలువ కట్టగలదా ? అంటే—చాలా సందేహం-నిలిచిపోయిన వాటిలో గొప్పతనం వుందని వొప్పుకోవచ్చు, కాని గొప్పతనం వున్నవన్నీ నిలిచాయి, నిలుస్తాయి అని వొప్పుకోడానికి వీలులేదు. ఆ నాడు ఏమీ అర్థంకానంత గొప్పవై, ఎక్కడా నిలవక నశించిపోయినవెన్నో ! నిలిచినవన్నీ కనబడుతున్నాయి. నిలవని వాటి సంగతి మనకి తెలీనేతెలియదు. ప్రజలకి అంగీకారమైన విలువల్ని కొన్నిటిని పునాదిగా తీసుకొని, తక్కింది కొత్తదనాన్ని కల్పిస్తేనే ప్రజల మనసుల్లో స్థలం ఏర్పడుతుంది, అందాలకి. ప్రజలకి అర్థంకాని భాషలో, లేక అనుభవానికి దూరమైన

ఉపమానాలతో, ఊహాలతో. ఆలోచించే పద్ధతులకి వ్యతిరేకమైన నడకలతో, వ్రాస్తే ఎంత విపరీతమైన గొప్పతనం వున్నా ఎక్కడా పలకదు. అరచకుడికి మనస్సులో తప్ప విలువ నిలవదు. surrealism మొదలైన పద్ధతులకి వొచ్చిన ఇబ్బందే అది.

'సత్యమైనది, అందమైనది, ఎన్నడూ నశించదు. ఏ కాలానికో ఓ కాలానికి బైటికివొచ్చి అంగీకారం పొందే తీరుతుందనేదానికి - లోకపుపోకడలు చూస్తే చాలా విరుద్ధాలుగా కనపడ్డ విషయాలు-మతాలలో కళలలో, నీతులలో-ఏ నాటికో లోకంలో విజృంభించినమాట నిజమే. జీసస్ మరణంతో అంతమైపోయిందనిపించిన క్రిష్టియానిటీ వెయ్యి సంవత్సరాల తరవాత ప్రపంచాన్నే పాలించింది. ఇట్లాంటి విలువల విజృంభణలు ఎన్నో చూస్తాము. కాని నిలిచినవే మన కళ్ళకి కనబడుతున్నాయి కాని, నిలవక పూడ్చుకొనిపోయిన గొప్పవిలువలు ఎన్నిలక్షలో! జీసస్ బోధించాడు-కాళిదాసు వ్రాశాడు రాఫిల్ చిత్రించాడు. మీరాబాయి పాడింది. కాని బోధించక, వ్రాయక, పాడక తమ హృదయాల్లోనే ఆనందించి జీతింపచేసుకున్న మౌనుల సంగతి! పైకి చెప్పినా అర్థం కాక వెర్రివాడి క్రింద తరిమేసి, ఏ నాటికీ గుర్తులేక నశించినవారిసంగతి! కాని యీ భౌతిక వాతావరణాన్నుంచి పైకిలేస్తే, లేవడంలో వివేకమూ, అర్థమూవుంటే, మనిషి మనసులోనైనాసరే, గట్టివైన వాస్తవమైన కలలకీ, కళలకీ, యత్నాలకీ సదుద్దేశ్యాలకీ ప్రేమకీ, ఎక్కడో ఏ ప్లేన్‌లోనో వాస్తవత్వముంది-ఎక్కడో ఎట్లానో ఏ spiritual ether లోనో, పలుకుతాయనివుంది. మనకి కనపడే ఈ సూర్యకాంతిగాక, ఏవో cosmic rays భూమి మీద శక్తికి కారణమన్నట్టే, మనదేశంలోని యోగులు, ఏమీ వ్రాయని కవులు, హృదయాలోని కవిత్వాన్ని ప్రేమని మాటలోకూడా వెల్లడిచేయ్యలేని చెయ్యడం చాతకాని ప్రేమికులు, వీళ్ళబాధలు, కలలు, కవిత్వాలు, ఏ వాతావరణం లోనో నిలిచి, ఎవరిద్వారా పలుకుతున్నాయో ననిపిస్తుంది. కాని ఇట్లా అనిపించడమే గాని, నిజమని రూఢి ఏమీలేదు.

మనిషికి తన మనస్సులో వున్న విలువలకీ, పై ప్రజలలో విలువలకీ భేదం స్పష్టంగా తెలినప్పుడు హాస్యాస్పదుడూ, విషాదకుడూ అవుతాడు. Don quixote కొద్దో గొప్పో?

ఓ సారి క్రిష్ణశాస్త్రిగారితో అన్నాను పూర్వం "మనం గొప్పవి కల్పిస్తున్నామనీ, మనం తద్వారా గొప్ప వాళ్ళమనీ అనుకునే విలవ మన మనస్సుల్లోదే. దాన్ని లోకంమీద పడేసి, ఆ విలువ బైటకూడా వుంది అనుకున్నట్టు ప్రవర్తిస్తే, దెబ్బ తింటాము. అవమానపడతాము. మన వ్రాతల విలువ లోకంలో అంగీకారం పొందినప్పుడు గాని మన మనసులో గొప్పతనం అక్కడే అవతరించాలి."

దుష్యంత పాత్రధారి, తాను దుష్యంతుణ్ణని రైలుస్టేషనులో తిరిగితే, ఇతరులకి ఎంత entertainment! కాని పూర్తిగా ఆ పిచ్చిలో నిలిస్తేనే గాని అతనికెంతబాధ।

ఆ పుస్తకంలో వ్రాస్తున్నాడు కదా.

when a woman is perfectly sane, head screwed on tight, full of culture and art, and has a vote, and all that, it is impossible to be happy with her.

పూర్తిగా వివేకమున్నదీ, సంస్కారమూ, కళాజ్ఞానమూ, ఓటూ అట్లాంటి వన్నీ వున్న స్త్రీతో సుఖించడం అసాధ్యం అని.

క్రమంగా స్త్రీలందరూ అట్లానే తయారవుతున్నారు, జ్ఞానాన్ని, స్వతంత్రాన్నీ, సంతుష్టినీ, అధికారాన్ని వెతుకుతో. వారి ఈ మార్గం తప్పా।

ఒక విధంగా తప్పే. స్త్రీ అబలత్వాన్ని, నిర్ధనత్వాన్ని, సంఘంలో గౌరవ హీనత్వాన్ని, పిల్లలతో సంబంధాన్ని. బాగా advantage తీసుకొని, తన ధర్మాల్ని, బాధ్యతల్ని, పురుషుడు ఉపేక్ష చేసుకోకపోతే, మార్కెట్‌లోకి నడవవలసిన దుర్గతి స్త్రీకి పట్టదు. ఆమె సంసారంకోసం, పిల్లలకోసం చేసిన త్యాగాల్ని, లొంగిపోవడాన్ని అవకాశం తీసుకొని ఆమెని ఎన్ని నీచత్వాలకి వొంచాడు ? గతిలేక తిరగబడి మగవాడి అవసరం అధికారం లేకుండా బతకాలనే ప్రయత్నంలో ధిక్కారం చేస్తుంది స్త్రీ. కను కనే ప్రస్తుతం నాగరికత పొందిన స్త్రీతో సుఖించడం అంత అసాధ్యమౌతోంది. అది స్త్రీ తప్పుకాదు, తన పూర్వపు అధికార ప్రతిష్ఠని మరవలేని పురుషుడి తప్పు.

అనాదిగా సర్వత్రా జరుగుతున్న పురుషుడి యీ అధికారంలో పూర్వముండే ధర్మమూ, దయా ఐకమత్యమూ క్రమేపి స్త్రీ అసహాయత్వంవల్ల నశించి, యీ లోకపు కాంతినీ విలువల్నీ, అందాల్నించి తనని వేరుచేసి ఉక్కిరి బిక్కిరి చేస్తోందని నాగరికత పొందినకొద్దీ స్త్రీకి వ్యక్తమౌతోంది-అందువల్లనే చదువుకున్న స్త్రీలలో పురుషుడి మీద మనసులోని యీ తిరుగుబాటు. అతని అధికారాన్ని ఆధిక్యతని సహించలేని యీ స్థితి. తన చదువువల్ల romance లో విశ్వాసం. ఆ చదువులు చెప్పే నీతివల్ల శరీర సంపర్కం నీచం ఆమె మనసులో సృష్టి ప్రోద్బలంవల్ల పురుషుడిమీది ఆకర్షణ, మనసు ధిక్కారంవల్ల అతనిమీద అసహ్యం. ఆమెలో జరిగే యీ నిరోధాలవల్ల చాల వికృతంగా తయారవుతోంది స్త్రీ నాగరికత పొందినకొద్దీ.

స్త్రీలో ఈ తిరుగుబాటంతా తాత్కాలికం అనిపిస్తుంది. ఎందుకంటే ఆమెలో చాలవరకు emotional side అమితం. ఎక్కువ జీవితంలో తాను కల్పించుకోగల

అందంమీద ఆధారపడుతుంది ఆమె. ఆమె ప్రోద్బలాలు సృష్టికి దగ్గిర, ఫలించే భూమికి. ఈనే చేనుకి. పైనుంచి మనం ఎన్ని సౌఖ్యాలు, సంతోషాలు, సంతుష్టులు తెచ్చుకున్నా, మనలోపలి sub-conscious నించి శాంతి రానిది, ఏదీ మనలో రాణించదు. అంతశ్శాంతికి మనకి తెలీని కారణాలుగాని, సుఖమైన భోజనం, కామ వాంఛ, తృప్తి a sense of safety, ముఖ్యం.

ఈ కొత్త స్వేచ్ఛా సమరం వల్ల స్త్రీ చాలా త్వరలో పురుషఅధికారాన్ని తెగ కొట్టి, బాధ్యతల్ని గుర్తించి తనని గౌరవించేట్టుగా పురుషుణ్ణి మచ్చిక చెయ్యాలి. లేక పోతే తమ స్త్రీత్వాన్ని శాంతిని వేళ్ళతో కదిలించేసుకుంటుంది. స్త్రీ, స్వేచ్ఛవల్ల శాంతి రాని స్వేచ్ఛ అర్థహీన మయింది. శాంతి అంటే నిద్రా అలసటా కాదు. దానికన్న కాల్చే సమరం చాలా ఆరోగ్యం. శాంతి అంటే నిజమైన చుట్టూ ఆనందాన్ని వెలిగించే శాంతి.

నిజమైన పాతివ్రత్యానికి అదే అర్థం. మనిషి ఏ కళలోనో, దేశభక్తిలోనో తనని తాను ఐక్యం చేసుకుంటే దానిని బానిసత్వం అనం. అతన్ని బలవంతం చేసి నప్పుడే-ఏ సేవకైనాసరే-లాక్కుని వెళ్ళినప్పుడే అది ఘోరమౌతుంది.

అట్లానే స్త్రీ తన వ్యక్తిత్వాన్ని స్వచ్ఛందంగా ఏ భర్త సేవకో పిల్లల అభివృద్ధికో సంసారంలో ఐక్యం చేసుకుంటే, అది ఆమెకి ఆత్మశాంతినీ చుట్టూ వాళ్ళకి సుఖాన్ని, గృహానికి తేజస్సునీ ఇచ్చేట్టుండాలి. ఆ ఆదర్శాన్ని మవసులో పెట్టుకునే.యీ పురాణాల్లో యీ వికృత స్వరూపాల్ని, సీత, చంద్రమతి, సావిత్రుల్ని సృజించారు. అసలు మూలగ్రంథాలలో యీ పతివ్రతల్ని సరిగానే పోషించారేమో। అసలు spirit చచ్చి, యీ కొత్త గ్రంథకర్తల చేతుల్లో ఇట్లా ఐనారో ;

అట్లానే సంసారంలేని స్త్రీలూ సరైన సంసారం లేని వాళ్ళూ, ఏమీ కోరక ప్రత్యుపకారం అడక్కుండా, మోహానికి తమని తాము ఇచ్చుకున్న స్త్రీలు వున్నారు. పతివ్రతలు ఎవరి పాదధూళిని తలల ధరించడానికి పనికిరారో, అటువంటి గొప్ప శృంగారమూర్తులు. అట్లాంటి శోభాన్వితలు-నేనెరిగిన తాయారు మేరీవంటి యువతులు, Not for money, not for contract అంటుంది. voyage అనే గొప్ప పుస్తకంలో థెరసీ, తన జీవిత యాత్రలో.

ఏది ఏమైనా, ప్రతి మనిషి మనుసులోనూ, ఎన్ని భేదాలు వున్నా: ఇది మంచి అనీ, ఇది చెడ్డ అనీ, ఇది అందమనీ, ఇది అందవికారమనీ, ఇది జ్ఞానమనీ, ఇది. అజ్ఞానమనీ ఇట్లాంటి భేదాలు వున్నాయి. ఇట్లాంటివి లేకుండా ఏర్పడదు మనిషిమనుసు.

అదే మనిషి మనసుకీ, మృగాల మనసుకీ భేదం. మంచీ, అందం, జ్ఞానం ఇట్లాంటి వాటిల్లో ప్రతి మనిషికీ, భేదాభిప్రాయాలు వున్నాయి. వాటిల్లో కొన్ని ఉన్నతమైనవని వాటిని అందుకోవాలని ప్రయత్నాలు వున్నాయి. కాని ఏవి ఉన్నతం అనేది తర్కంవల్లి ఎన్నడూ తేల్చుకోలేము. అది తర్కాన్నిమించిన ఏ లోక దృష్టికో వొదిలిపెట్టాల్సిందే.

దీంటో కావల్సింది సిన్సెరిటీ-తమ ఘనతకోసం, భేషజం కోసం, ఈర్ష్యవల్లా, తమకి తెలుస్తున్న ఆధిక్యతని వొప్పుకోకపోవడం, ఇతరమైన prejudices వల్ల కన పడేదాన్ని చూడ తలచుకోక పోవడం, తమ vested interests కి ఎక్కడ భంగం కలుతుందోనని, అబద్ధాలాడడం-వీటివల్ల ఘోరాలు జరిగి వున్న వెలుతుర్ని కూడా పోగొట్టుకుంటారు మనుషులు. సత్యం, శివం, సుందరం వీటికి దగ్గరిగా నడిచినకొద్దీ, వికాసం, తేజస్సూ, దూరమైనకొద్దీ, చీకటీ, ఇరుకు అనేది నిజం. ఆ మాటల అర్థాలు మనసులో ఎంత భేదించినా సరే.

## 6

కొన్ని వస్తువులు అసలు అందంగాను; కొన్ని అంద వికారంగాను యెందుకు కనబడాలి? సౌందర్యకారులు అనేక కారణాలు చెపుతారు. వాటికేంగాని-మొత్తానికి అందాన్ని మనస్సు కల్పించుకుంటోంది. మనస్సుని మార్చిన కొద్దీ, ఇదివరకు కనబడని అందాల్ని చూడగలుగుతాయోమో? అంతేగాదు. ఇదివరకు అందవికారంగా కనపడేవి యిప్పుడు అందంగా కనపడడమూ, అందంగా వున్నవి, ఇంకా అందంగా పెరగడమూ సంభవించవొచ్చు. ఆలోచించగా ఆలోచించగా ఒక plane ప్లేన్‌లో అందవికారమనేది వుండదేమో, అంతా అందమే తోస్తుందేమో. లోకమంతా అనేకవిధమైన అందాలుగానే కనబడుతుందేమో అనుకుంటాను. జెర్రిని చూస్తే చాలా అసహ్యం నాకు! (తెనాలి 'జెర్రి' నిన్ను చూస్తే కాదు. నీవు జెర్రివి కావు Jarry వి.) భయం కూడా. కాని నా (fee lings) ఫీలింగ్సునించి విడదీసి-చాలా కష్టమది-జెర్రిని విడిగా లోకంలో ఒక వస్తువుగా చూస్తే, జెర్రి గంభీరమైనది అందమైన జీవి. కాని పూర్వజన్మనించో, నా చిన్నతనం నించో, నాపూర్వుల నించో యీభయాన్ని నామనసు తెచ్చుకుంది. అట్లానే యీఅందాల ఆకర్షణ కూడా యుగయుగాలనించి నా మనసు నేర్చుకుంది క్రమక్రమంగా.

అంతేకాదు. మనం దుర్మార్గం, నీచం, పాపం, అంటామే. ఆ గుణాలన్నీ కూడా మంచి గుణాలేమో? మంచి గుణాలే. స్థలకాల భేదాలవల్ల అట్లా చెడ్డవైపోయినాయి. డబ్బుదాచుకోడం మంచిదే; పూడ్చిపెట్టడం తప్పైపోయింది. ఒక్క స్త్రీ మీది కామం

మంచిదే. రెండో స్త్రీ మీదిది చెడ్డదయింది. మనకు కలిగే లాభనష్టాలనుంచి గుణాల్లోని మంచి చెడ్డల్ని నిర్ణయిస్తాము. మనకి ఉపయోగ పడేట్టు అబద్ధం చెప్పితే త్యాగం. మనకి అపకారం కలిగేట్టు నిజం చెబితే క్రూరత్వం. ఈ గుణాల విభజన మనసు నేర్చు కున్న అలవాటు. కాలమూ, దూరమూ, చిన్నా, పెద్దా యివన్నీ మన మనసు చిన్నత నంలో నేర్చుకున్న అలవాట్లు. అవన్నీ వృత్తకంటి చేతి(eye and hand)భ్రమలంటే నమ్మడం కష్టం. ఈ అందాలూ గుణాలూ పుణ్యాలూ అంతే.

సృష్టి సౌందర్యానికీ, స్త్రీ సౌందర్యానికీ భేదాలు చెపుతారు కొందరు మిత్రులు. స్త్రీ సౌందర్యంలో వాంఛ ఉంటుందిట. సృష్టి సౌందర్యంలో వాంఛ వుండదట. కాలం గడిచినకొద్దీ నాకు భేదం కనిపించడం లేదు. ఈ సౌందర్యమంతా వొక్కటే ప్రతి చోటా కన్ను కల్పించుకొంటున్న యింద్రజాలం. చాలా సుకుమారమైన, వాంఛనీయ మైన యింద్రజాలం. ఇంద్రజాలమని తెలిసినా కూడా మాయ చెదిరిపోని, ఆనందం వీడని ఇంద్రజాలం. సౌందర్యమూ,ఆనందమూ మాయ కావు. అందవికారమూ, అసహ్యమూ, మాయ-అన్ని వస్తువులూ సుందరమైన వస్తువులూ వాంఛనీయమైనవి అయిపోవాలి. మనసుకి స్త్రీ నించిగాని. దేనినించిగాని, విరక్తిగాదు; కావలసింది. ప్రతి దానిలోనూ ఆసక్తి కావాలి అదీ అభివృద్ధి. స్త్రీ నించి పొందే ఆనందాన్ని ఆకాశపు నీలత్వంలోనించి నీళ్ల చల్లదనంలోంచి గడ్డి మెత్తదనంలోనించి, పువ్వుల మెరుగులోంచి పొందాలి. ఇవన్నీ స్త్రీ ఇచ్చేటంత అంత ఆనందాన్ని నాకూ యివ్వాలి.

స్త్రీ అందమనీ, సృష్టి అందమనీ ఒకటి వర్జనీయమనీ, ఒకటి అంగీకారమనీ, యీ భేదాలు, శాస్త్రిలు బోధించి భయపెట్టిన దౌర్భాగ్యాలు.

సృష్టి సౌందర్యంలో మాత్రం వాంఛ లేదా? మబ్బుల మీద పడుకోవాలని, నీళ్ల మీద తేలాలని, పువ్వుల్ని కోసుకోవాలనీ, గడ్డిలో కూచోవాలని, కొండల్ని కావలించు కోవాలని కోర్కెకలగలేదా? జడుడా? పోతే స్త్రీ రొమ్ము మీద కళ్లలోతుల్లో, తొడల నవనవల్లో, నడుము పొడుగులో, పొట్ట కింద గచ్చులో ఏం అందాలు చూశావు? నీ మొహం!

కోర్కెలో లేదు భేదం. స్త్రీ సౌందర్యాన్ని ఉపయోగించుకోగలవు. సృష్టి సౌంద ర్యాన్ని ఉపయోగించుకోలేవు. అప్పటికీ పువ్వుల్ని తలలోనూ కోట్లకీ తగిలించు కుంటూనే వున్నారు. కాని అవి అందక నవ్వుతాయి. అయినా స్త్రీని మాత్రం యేం ఉప యోగించుకొని ఏం సౌఖ్యపడుతున్నారు? ఈ తృప్తినిచ్చేది కామంగాని సౌందర్య

భావం కాదు. కోటులో పుష్పం అందం వలెనే యింట్లో స్త్రీ అందం నీకు అందక, నీగోడ లికి, తలుపులికి పరజాలకి, చేతులకి, చూపులకి, సంభోగాలకి, పేరంటాలకి, వియ్యా లకి అతీతమై, దేవత్వాన్ని పొంది, నిన్ను శుద్ధ మూర్ఖుణ్ని చేసి నవ్వుతుంది. నువ్వు అనుభవించేది చర్మం; సౌందర్యం కాదు.

స్త్రీని పూర్తిగా తన మురికి అనుభవంలోకి యీడ్వడం చాతగాక చివాట్లూ, దెబ్బలూ, నీచత్వాలూ, అవమానాలూ. ఏమీ ఆమె హృదయధీరత్వాన్ని వొంపలేకపోతే నిరాశచెంది కసిపూని పురుషుడు శాస్త్రంలో కథలలో తిట్టిపోశాడు.

ఎందుకంటే లోకాన్ని సంతానంతో నింపే స్త్రీ స్వభావానికీ, జీవరాసుల్ని పోషించే భూ స్వభావానికీ చాలా సన్నిహితం-తొక్కి, దున్ని మలినం చేసి భూమిని ఎంత సాధించారో నీచపరిచి ఉపయోగించుకుని స్త్రీని అంతే సాధించగలరు.

ఎందుకంటే యీ సౌందర్యాని కంతా వెనకవుండే శక్తి అంతా వొక్కటే. అది మన పెదిమలకి అంటదు. అధికారాలకి లోబడదు; వూరికే హృదయాన్ని పిలిపించి, అందుకోవాలని నడిచినకొద్దీ, ప్రతిధ్వనివలె దూరంగా పోయి నవ్వుతుంది. అవి ఎండ మావులు. అదే ఆకాశం. అదే వెన్నెల చుట్టూ వుంది. చిక్కదు. అదే స్త్రీ ముఖంమీది చిరునవ్వు, పిల్లల వంటి మీద కొత్త మెరుగు.

శరత్కాలపు ఆకాశం నీలం; జేష్ఠమానపు వానల తరవాత గాలిలో నిర్మలత్వం, ఏదో అర్థం కాని నూతనత్వం-అదీ సౌందర్యం-ఏకవి వర్ణనలకూ, యేచిత్రకారుడి కుంచెకీ అందని అందం.

అదే స్త్రీ నల్లగుడ్డుచుట్టూ కనపడే కాంతి, అదే చిరునవ్వులో పెదిమ వొంపు లోని కొంటెతనం అదే తల్లి ముఖంలో వెల్లివిరిసే తేజస్సు.

Eyes can see only dust and earth
But feel it with your heart, it is pure joy.
The flowers of delight blossom on all sides in every form
But where is your heart's thread to weave them in a garland.

ఈ అందవికారం, దౌర్భాగ్యం బాధ అసహ్యం యివి కూడా ఆశక్తేనేమోనని నా అనుమానం. ఎందుకంటే యీ అందమంతా మనసు నేర్చుకున్న అలవాట్లుగా; ఈ అలవాట్లనించి మనసు తప్పించుకున్నపుడు యే సాధనవల్లనో ఈ చిక్కులోంచి బైట పడ్డప్పుడు ఈ లోకమంతా, మనుషులు, రాళ్లు, ముళ్లు, పాములు, అన్నీ ఒక్కటే

సౌందర్య సముద్రంగా కనబడతాయేమో! ఆ దృష్టితో ప్రపంచాన్ని ఒక్కనిమషం- ఆ Vision (దీనికి తెలుగు చేతకాలేదు, రమణయ్యగారూ) చూడాలని ప్రయత్నిస్తాను. ఒక్కడే పరమేశ్వరుడు యిన్ని రూపాలు తన లీలకోసం ధరించాడన్న ఉపనిషత్తుల ఉపదేశం జ్ఞాపకం వొస్తుంది.

అదికూడా సరికాదు. అసలు ధరించనేలేదు. ధరించినట్లు తోపిస్తున్నాడు అని పిస్తుంది. ఎందుకంటే-వొద్దు మరీ వేదాంతంలోకి పోయి మీకు విసుగెత్తిస్తాను. వెర్రి! ఆట! కాదు అదో తమాషా. జెర్రినీ, ఆదారిని తలుచుకుంటాను- ఈశ్వరా! నీకేం తమాషా యిట్లాంటి రూపాల్ని ధరించడం కూడా నీ లీలయేనా! ఇట్లాంటి వికృతాల్నీ, వికారాల్నీ పొందటం నీ కెట్లా యిష్టమయింది? అనుకుని చప్పన నాలిక కొరుక్కుని ఇవి వికారాలు కావుగా నా మనసు కల్పిస్తున్న వికారమే గాని, అసలు యివి విశ్వ సౌందర్యం లోని కిరణాలే కదా! అని అనుకోగానే sense of humour అంతలావు పొట్ట మనిషి, ఆ గుండ్రటి bullet head.

పొట్టివాడే- పెద్ద పొట్టవాడే!
వొట్టి డబ్బాలతో-వొచ్చినాడే! (కవి ॥కూ॥సూ॥)

అదేం కిరణం? అని పకపక నవ్వొస్తుంది. అంతేకాదు. ఈశ్వరుడే ఈ రూపాలన్నిటినీ ధరిస్తే-యీ వ్యక్తుల ద్వారా యీ బాధలన్నీ ఎందుకు పడుతున్నాడా! అని సందేహం కలుగుతుంది. కాని ఈ ఆకారంలో అందవికారాలన్నీ యీ కుష్ఠు, యీబొర యివన్నీ లేనట్టే ఈ దుర్గుణాలు, యీ యీర్ష్య: యీ మోసం, యివన్నీ లేనట్టే యివన్నీ మనసు కల్పిస్తున్న వికారాలైనట్టే, యీ బాధలూ, రోగాలూ, చావులూ, ఇవన్నీ కూడా వాస్తవం కాదేమో! అసలు లేవేమో మనసు కల్పించుకుంటున్న మాయలేనేమో అనుకోవాలని చూస్తాను. కాని నాకు తలనొప్పిరాగానే, డొక్క వీపుకంటుకుపోయిన ముష్టిది. నాలిక వేళ్లాడేసుకుని చస్తున్న కుక్క, చచ్చి కొడుకోక్కసం యేడ్చే ముసలిది. నీరులేక తల వేలాడేసిన తోటకూర మొక్క, సగం దేహం తెగి యింకా మూలకి పాకే వాన పాము, నా కంటపడగానే-యిదంతాకూడా మాయా? అని నన్నూ నావంటి మాయావాదుల్నీ చెప్పుదీసుకొని తన్నాలనిపిస్తుంది.

పాలికాపు నుదుటి చెమట
కూలిదానిగుండె చెరువు
బిచ్చగాని కడుపు కరువు
మాయంటావు? అంతా

మిధ్యంటావు ?
నా ముద్దుల వేదాంతీ
ఏమంటావు ? (శ్రీశ్రీ)

మన సౌఖ్యాలు, అన్నీ మనసు కల్పించిన మాయలేకాని వాస్తువులూ ప్రపంచం మాయే కానీ, అనుభవం-మాయకాదుకదా? సుఖపడడం మాయ ఐనా బాధ పడడమనేది మాయకాదు.

"జమీందారు ఫోర్డు కారు
మహారాజు మనీ పర్సు"
మాయ ఐనా,
"తుపానుల భూకంపం"
మాయ కావు.

చావు మాయ కాదు. శాశ్వత జీవనం అనేది వున్నా, చావు తరవాత యెక్కడో మిగిలినా, చావు మాయే ఐనా, మన మిత్రుడు కనపడకుండా పోవటం, మన మాటకి జబాబు చెప్పకపోవడం, ప్రతి సాయంత్రం టీ దగ్గర జ్ఞాపకం వొచ్చి దిగుళ్లలోకి నెట్టడం కొత్త కథ విని సంతోషించడానికి లేకపోవడం మాయకాదు కదా ;

అనుభవం క్షణికమే, fleeting, inpermanent అశాశ్వతం. కాని బ్రతుకే క్షణాల అనుభవాల మీద ఆధారపడ్డప్పుడు-అవి తప్ప గతిలేనప్పుడు, శాశ్వతమనేది వేదాంతుల వాదనల్లో, కవుల కలలతో తప్ప ఎక్కడా కనపడనప్పుడు ఇంకేం గతి?

డబ్బు అంటే దమ్మిడీలే కదా! ఏం గొప్ప! అన్నట్టుంది ముష్టి అతనికి ఆ దమ్మిడీలే గొప్ప !

క్షణాలనే నమ్మి, పరిగెత్తిపోయి స్వల్ప ఆనందాలతోనే సుఖపడదాము. ఏదో వొరుగుతుందని నమ్మిమాడి చావని వేదాంతుల్ని-నేనూ ఆదారి ఒకటే శక్తిలోని భాగాలా వొప్పుకోను. అదే నిజమైతే-నేను అబద్ధంతోనే బతుకుతాను. ఈ ఆదారే ఈశ్వరుడైతే, నేను సైతానుగానే వుంటాను.

## 7

నా హృదయంలో ఎందువల్లనో దేశభక్తి పలకదు. పలకడమే సంభవిస్తే జీవితము చాలా వేరే మార్గాన్ని పట్టేది. అట్లానే కమ్యూనిస్టులు మాట్లాడే గుడ్డి చిలక

పలుకుల్ని విని ఎల్లప్పుడు ఏవగింపు కలుగుతుంది. కాని ఆస్తుల్ని, అసువుల్ని, అస్తికల్ని ఒక విశ్వాసం కోసం అర్పిస్తున్న యీ జనాన్ని చూస్తున్నప్పుడు, ఆ వొక్క త్యాగం వల్ల వాళ్ళ పాదాల ముందు నా శిరసు వొంగుతుంది. ఏ గొప్ప విషయాన్నీ ఏ ధీరత్వాన్ని కూడా ఊరికే చప్పరించి "ఏముంది?"అని తీసిపారేస్తేనేగాని స్వ మనతని నిలబెట్టుకోలేము. 'వాడి కేముంది? లోఫర్,రౌడీ అందుకని వున్న వాళ్ళది దోచుకోవాలనే ఆశతో పోతాడు జైలుకి, దెబ్బలు తింటాడు. చస్తే చస్తాడు కూడాను. వాడు చస్తే ఎవరికీ వొచ్చిన నష్టం లేదు' అంటారు. అతనికి ఏంలేక పోయినా వుంది, సుఖాన్ని కోరే ఓదేహం, నీ అంత తీపిగల ప్రాణం. దాన్ని వొడ్డి దూకుతున్నాడు, ఏ దూరవు ఆశతోనో నువ్వూనేనూ ఒప్పుకోవడానికైె కావచ్చు కాని ఈలోపల నువ్వూ నేనూ సుఖంగా భోజనంచేసి చప్పరించి హాయిగా కళ్ళు మూసుకు నిద్రపోతున్నాము, మన మనుషుల్ని కలత పెట్టకుండా సినిసిజాన్ని గట్టిగా కప్పుకుని.

కమ్యూనిజంలో వుండే గొప్పశక్తి ఏమిటంటే, ఏ విషయాన్నైనా సరే-ఆరోగ్యము, విద్య, ఆర్థిక విధానము, దేవుడు,నీతి. దేనినైనాసరే—పాత బూజుల్ని దులిపి, ఈనాటి ప్రజా క్షేమపు దృష్టితో చూడగలగడం. పెద్ద బలహీనతేమంటే కమ్యూనిజ సిద్ధాంతంలోంచి తప్ప, దేనినీ చూడలేక పోవడం, దానికి విరుద్ధమైన దాంట్లో సత్యం కనపడక పోవడం, బలహీనత కాదేమో! ఎంత తర్కంతోనూ, సత్య ప్రదర్శనంతో కూడా కమ్యూనిస్టు విశ్వాసాన్ని చలింప చెయ్యలేము. అదే వాళ్ళ బలం మళ్ళీ...కాని ఎంత గట్టి విశ్వాసాలూ, ప్రపంచ చరిత్రలో వాటి గుడ్డితనం వల్ల అవే బద్దలై, నూతన సత్యాలకి దారి తప్పుకుని పూడ్చుకుపోయినాయి.

మత విశ్వాసాలూ. రాజకీయ విశ్వాసాలూ రూపం మారవచ్చు. కొన్ని అసలు రూపులేకుండా పోవచ్చు. వాటి అవసరం తీరినప్పుడు. కాని మానవుడు నిరంతరం తన రక్తంతో తాను నమ్మిన దేవతని అభిషేకం చేస్తోనే వున్నాడు. ఈనాడు మనకి 'ఎంత వ్యర్థం!' అనిపించినా, ఆనాడు అతనికా విశ్వాసం జ్వలించే సత్యం, దానికి ఆహుతి ఐపోవడం అతనికి ఆత్మతృప్తి. చిన్న విషయాలలో పెద్ద విషయాలలో ఈ విధంగా తమ సౌఖ్యాన్ని నరికి హోమం చేసే కొద్దిమంది వల్లనే మానవజాతి నిరంతరం అమృతత్వాన్ని పొందుతోంది. కాని ఆ వొక్కరికి వెయ్యి మంది నామిత్రుడు బోటి వాళ్ళు సుఖంగా కుర్చీలో పరుచుకుని 'ఆ ఏముంది లెండి? ఎందుకంతా!' అని చప్పరిస్తోనే వుంటారు

ఎదురుగా ఎండలో పక్షులు ఎగురుతో వుంటే, ఓ కాకినో చిలకనో ఐవుంటే ఎంత సంతోషంగా వుండును అని చాలా మనసు ఆశపడుతుంది. నిజంగా వాటిలో

ఆ సంతోషం వుందో, లేక వాటి స్వేచ్ఛా విహారం,అరుపుల కోలాహలం,ఆకాశయానం చెట్ల గుబుర్లలో, నీడల్లో శాంతంగా కబుర్లు చెప్పుకుంటో కూచోడం, వీటిని చూసి నా మనసు వాటికి లేని సుఖాన్నీ, నిర్విచారాన్నీ వాటికి ఆపాదిస్తోందో? కాని మృగాలో, పక్షుల్లో కూడా మొహం చూసి వాటి మనోస్థితిని అర్థం చేసుకోవచ్చు. గానుగ ఎద్దుకి అంబోతుకి అప్పుడే పుట్టిన దూడకీ, మొహాలలో, వొంటి తీరులో ఎంత భేదం తెలుస్తుంది. అటానే వానలో తడసిన గోరంకికీ, కొమ్మల మీద కూర్చున్న చిలుకకీ భేదం తెలుస్తుంది మధ్యాహ్నం ఎండలో ఆ తెల్లని మబ్బుకి దగ్గిరిగా శాంతంగా తేలే గద్దలో స్థిమితమే లేక, భూమి మీద చాపముక్క కోసం వెతకడమే నంటే నమ్మడం కష్టం. అట్లాంటి అందమైన జీవితాల్ని చూసో కూడా, మనుష్య జీవితాన్ని చూసుకుని పొంగి పోవడంలో అర్థమేమిటి? ఎంత సంతోషంలో కూడా భారమేకద నవ్వు? పోసీ అన్నీ మరచి నవ్వగలిగిన నిముషాలైనా ఎన్ని వుంటాయి?

కాకి జీవితం అన్నిటికన్న సుఖమైన జీవితమని, దానికి తిండి ఎక్కడంటే అక్కడ దొరుకుతుంది. దానికి శత్రువులు లేరు, ఎవరూదాన్ని తినరు. రెండు కాకులు ములగచెట్టు గుబుర్లలో కూచుని చూస్తో వుంటే, నన్నువాటిల్లోకి తీసుకోకూడదా అని వ్యాకుల పడతాను. చాల సంతోషసమయంలో కూడా.

కాని క్రమంగా ఈ కవితా వస్తువులు, చిలకలూ,గోరింకలూ,కోవెలలూ, భ్రమరాలూ చాలా చవకపడ్డమే కాదు, వాటిపేర్లు వికార పెడుతున్నాయి. భ్రమరాల్నీ, పద్మాల్నీ రజనీ కాంతారావుగారు మద్రాసు రేడియో స్టేషన్‌కి తోలుకు పోయినారు. సినీమా పాటలో 'కూ,కూ' అని విన్న తరువాత, కోవెలల్ని వసంతంలో ఆప్యాయంగా ఆహ్వానించలేము. ప్రతి రోడ్డు మీదా. 'శతపత్ర సుందరీ!' అని అరుస్తో వుంటే, ఎన్ని కలలు ఒక్క వూపులో భగ్నమై పోతాయి! 'తీయని వెన్నెలరేయి' అని ఆయాస పడుతో పరిగెత్తుతో వుంటే ఇంక వెన్నెలల శాంతంగా అనుభవించడం ఎట్లా? ఎక్కడెక్కడ ఏ కవి దేన్ని అందంగా అనుభవించాడో దానినంతా వెతికి యీడ్చి బైటకి లాగి,ధ్వంసపరచి మళ్లీ తలుచుకోకుండా చేస్తున్నారు సినీమావారు. ఈవిధంగా టాగూరు గార్ని బెంగాలీ ఫిల్ముల్లో ఎంత హత్య చేస్తున్నారో!

శ్రీశ్రీపేరు ఎక్కడ కనపడ్డా చదువుతాను. పత్రికలు తెరవను గనక కనపడడమే అరుదు. మొన్న హఠాత్తుగా టాగూరు గారి గీతాంజలి కన్న ఏదో డిటెక్టివ్ నవల గొప్ప దన్నారు శ్రీశ్రీ. శ్రీ శ్రీ నిజమైన కవి. ఆయనకి గొప్ప కవిత్వదృష్టి మెలోడీకి చెవి లేకపోతే, ఆ కవిత్వం ఆయనలోంచి రాదు. మిస్టిక్ కవిత్వం ఆయనకి నచ్చకపోవచ్చు.

కాని గీతాంజలిలో ప్రతి మాటలో స్ఫురించే కవిత్వం, అందం, ఆ కలల విశాలత్వం, మూలిగే నలిగే ఆత్మలకి శాంతీ, ఆశ, జీవితానికి ఓ అర్థ మివ్వాలనే ప్రయత్నం, యీ చిరాకుల్లోంచి, అల్పత్వాల్లోంచి గొప్పతనం చూడగల దృష్టి, ఇవన్నీ ఎట్లా మిస్‌కాగలిగారు శ్రీశ్రీ? ఒక పద్ధతిని మనం అంగీకరించక పోవచ్చు; దాన్ని ధ్వంసం చేయాలని కూడా ప్రయత్నించవొచ్చు; కాని అందం తెలిసినవాళ్లు, ఆ పద్ధతిలో వుండే గొప్పతనాన్నిగాని అందాన్నిగాని చూడలేక పోవడం చాలా చిత్రం. మన మనుషుల్ని ఏదో ఒక బలమైన ఉద్రేకం ఆవహించినప్పుడైనా అందానికి అంధులమైతే ఎట్లా? ఎంత కోపం వచ్చినా అందమైన మనిషిని అందవికారమనంగా? ఆ అందం హానికరమనగలం అంతే. టాగూరుగారి కవిత్వం హానికరమంటే, అది చర్చనీయమైన విషయం. కాని దానిలో గొప్పలేదంటే? మతాలూ, కులాలూ, దేవుడూ ఇవన్నీ చాలా సంకుచితం, అభ్యుదయ నిరోధకం అంటే ఆలోచించ వొచ్చు. కాని అవి వాటి కాలంలో ఎంత అవసరమో, ఎంత గొప్ప నిర్మాణాలో, వాటిల్లో ఎంత అందమో చూడలేకపోతే? అవును బ్రాహ్మసమాజపు రోజుల్లో, దేవుడి గుళ్ళో, ఆ పువ్వుల్లో, దీపాలలో, ఆ శిల్పంలో, హారతులలో నేను అందం చూడలేక పోయేవాణ్ణి.

## 8

"నా గొడవ విను, అసలు సంగతి ఏమిటంటే—మనం చూసే యీ జీవితం ప్రతి క్షణమూ మారుతో, పొంగుతో, అణుగుతో, అల్లరిపడే యీ ప్రజాజీవితం, వుత్త అలలు అంటాను. వీటి అడుగున వెనుక గొప్పలోతులేని సముద్రం వుంది. అలలని చూసి సముద్రమంతా ఇంతేననుకుంటున్నారు. ఆ సముద్రం ఊరుకోదు. ఈ అలల్ని కలవర పెడుతుంది. ఆట్లు, పోట్లు, ఉప్పెనలు, తుఫానులు, అప్పుడప్పుడు దొరికేముత్యాలు,—వీటన్నిటినీ ఏవేవో చెప్పుకుని అప్పుడే మరచిపోతారు, ఆ సముద్రం సంగతి. ఏ స్వల్పమో గ్రహించి చెప్పే చాలా గొప్ప సయన్టిస్టులకీ, కవులకీ, గాయకులకి కాలం కాదు. వారి వాణిని వినగల ఆసక్తి పోతుంది ఈనాటి ప్రజలకి. పైగా వుత్తమూర్ఖమని వాళ్ళ నోర్లు నొక్కుతున్నారు. వెర్రి వాళ్ళని వాళ్ళు అని ఉపేక్ష చేస్తున్నారు. సముద్రంతో సంబంధం మరచిపోయిన కొద్ది అలల అలజడి, స్వరూపం, ఏమీ అర్థం కాదు. అర్థం కనపడదు. కనపడని కొద్దీ అశాంతీ, జీవితంలో అర్థహీనత్వం, ఎక్కువౌతుంది. ఈనాటి యువకులు అసలు సముద్రం సంగతి పూర్తిగా మరిపిస్తేనేగాని, అలలు ఒక తీరుకీ, శాంతికీ రావనుకుంటున్నారు.

ఇన్ని గొప్ప ప్రయత్నాలు జరుగుతున్నాయి. నూతన లోకశాంతి అంటారు. కాని ప్రజల మనసులలో ఎంత విశ్వాసం తక్కువయిందో, ఎంత అశాంతి ప్రబలిందో చూస్తున్నావా? జీవితం వెనుక వున్న అగాధం సంగతి ప్రజకి విరివిగా చెప్పగల సామర్థ్యం గల ప్రవక్తలలో చివరి వారు ఈ లోకానికి గాంధీగారేనేమో అనిపిసుంది."

'ఎందుకీ సొద? ఏం చేస్తావు మరి?'

ఏం లేదు చందమామని చూసి కుక్కఏడ్చినట్లు, నక్షత్రాల్ని చూసి నీతో నా హృదయ బాధని చెప్పుకున్నాను"

"ఏం లాభం లేదంటావా?"

"మానవుడి హృదయంలోని స్వర్గాన్ని మానవుడికి విప్పిచూపగలప్రవక్త జన్మించాలంటాను."

## 9

లోకంలో శక్తులన్నిటిలోకి గొప్పది మానవుడి మనోశక్తి. ఆ శక్తి భయంకరమైన గాలి, వేడి, విద్యుచ్ఛక్తుల్నికూడా అదుపులో నుంచగలుగుతోంది. ఆమనోశక్తిని అభివృద్ధి చేసుకునేందుకు పురాతనంనుంచీ ఈ దేశంలో ధ్యానమార్గం చూపుతున్నారు. ప్రస్తుతం విజ్ఞానాధిక్యతను పొందిన యూరపు మనోశాస్త్రిలూ ఏకాగ్రతని బోధిస్తున్నాయి. ఆ ఏకాగ్రతే చివరి ఆధ్యాత్మిక స్థితికి మార్గమన్నారు. ఆ ఏకాగ్రతవల్ల మనసుకీ, సృష్టికీ అతీతమైన శక్తులుకూడా కలుగుతాయన్నారు. ఎటుచూసినా మనపని యేకాగ్రం చెయ్యడమే ముఖ్యసాధనంలాగుంది. ఏవాంఛ తీర్చుకోడానికీ, ఏ పనిని సాధించడానికి లోకంలో గొప్ప పదవుల్ని సాధించగలిగే గుణాన్ని సైకాలజీలో, **self-hypnotism** అన్నారు. అంటే ఆ పదవి వాంఛనీయమని యే సందేహం లేకుండా నమ్మి, ఆ మంత్రంలో మాయలో పడిపోవడం. రెండిటిమధ్య వూగే మనసు యేదీ గట్టిగా సాధించలేదు. ఆ గట్టి వాంఛ ఏకాగ్రతకి అవసరమైన భావోద్రేకాన్నిస్తుంది. అవసరమైన మనో సామాగ్రిని సమకూరుస్తుంది. అట్లా దేన్నో ప్రయత్నాన్ని నమ్మగలిగిన మనిషి ధన్యుడు. జీవితంలో యెక్కువ సమస్యలు వుండవు ఆ ప్రయత్నంలో నిమగ్నుడౌతాడు. కాని యేఏలక్ష్యంలో పెట్టుకున్నాడో అది వుత్తమమైన విషయం కాకపోతే, అది యెప్పటికో విషమించి సాధించినా తృప్తినియ్యదంటారు.

శరీరాన్ని, దాని శక్తినీ, ఏది కల్పించిరిది అని అడిగితే, లోకంలో బైటవున్న శక్తుల్ని, వేడినీ: కాంతినీ, పదార్థాలని చూపుతారు. ప్రపంచమంతా ఇక విద్యుచ్ఛక్తే

అనే స్థితికి వొచ్చింది సయన్సు. మనకే - ఈ చిత్తు awarness ఎక్కణ్ణించి వొచ్చింది అనేదే ప్రశ్న. వృక్షాల వరకూ యేదోవిధమైన చిత్తు వుందని అంగీకరించ వొచ్చు. రాళ్ళకీ, గాలికి-అనే ప్రశ్నవస్తే, యింకా తక్కువరకమైన నిద్రలోవున్న చిత్తువుందేమోనని ఊహించుకోవచ్చు. శరీరంతోపాటు ఈ చిత్తులోకూడా ఉన్నత పరిణామం evolusion కనపడుతోంది గనక. లోకంలో అపారమైన గుడ్డి భౌతికశక్తి, కాంతిలో గాలిలో, పదార్థాలలోవుంది. సాధనవల్ల ఆ శక్తిని మనిషి తనదిగా చేసుకుని తన పనులకు వుపయోగ పడేట్టు చేసుకోవచ్చు అట్లానే బైట నిద్రావస్థలోవున్న చిత్తును మనిషి తనదిగా చేసుకుని తన ప్రయోజనాన్ని సాధించుకోవచ్చు. మనిషి బుద్ధిలో ఆ చిత్తు బల్బులో గుడ్డి విద్యుచ్ఛక్తివలె గొప్పగా వెలుగుతుందేమో! భౌతిక శక్తీ చిత్‌శక్తీ అన్నీ వొకటేననవొచ్చుకూడాను. వేదాంతంతో సయన్సుకి యెక్కడ తగాదా వొస్తుందంటే వేదాంత లోకంలోని చిత్తుగాక, లోకం రూపాన్ని తీసుకొని చిత్తు వుందనీ, అదే అంత్య పరిణామావస్థలోవుందనీ, అంటే పరిపూర్ణమైనదనీ, దాన్ని సాధించేమార్గం మాత్రం సైకాలజీ, ఆధ్యాత్మిక విద్యా ఒకటే చెపుతున్నాయి. ఏకాగ్రత, భక్తి, జ్ఞానం, వైరాగ్యం. యోగం, pelmanism consentration ఈ పద్ధతులన్నిటికి ఒకటే అర్థం. పైపెచ్చు వేదాంతం దీని కింకోగుణం ఆనందమనే దాన్ని తీసికొచ్చింది.

చిత్తులోమల్లేనే ఈ ఆనందంలోకూడా, కొంతవరకు చిత్తుపైన ఆధారపడి, చాలా planes వున్నట్టు కన్పిస్తాయి. చాలా layers మనసుల్ని చిరాకులు, క్షుద్రమైన చంచలమైన ఆశల్నించి తప్పించినకొద్దీ, ఏదో శుభ్రం, వెలుగు, కలుగుతున్నట్టవుతుంది అందుకనే ఆర్టిస్టుచేసే అందాన్ని అనుభవించే ఆనందాన్ని యితరులెరుగరు. కొన్నినిముషాలైనా, ఈ పై చెత్తనుంచి విడివడి, లోపలికిపోయి అందాలు చూసి అనుభవిస్తాడు అతను.

నాకేమనిపిస్తుందంటే శంకరాచార్యుడి కాలంనుంచి వేదాంతం తప్పు మార్గాన్ని పట్టిందని, వేదాలు, ఉపనిషత్తులూ, ఆధ్యాత్మికానుభవంలో ఏ ఆనందం వొస్తుందనీ positive గా ఘోషిస్తున్నాయో, ఆ ఆనందం సంగతి చాలా వెనక్కినెట్టి వుత్త negative side వైరాగ్యం, అన్ని సుఖాలూ, కామాలు వొదులుకోవలసిన అవసరం మీదే వొత్తి వొత్తి బోధించాడు. దానివల్లనే సంసారం దుఃఖసాగరం కావడం కామినీ కాంచనాలకి విరోధం. సత్కారంమీద వాంఛకూడా అభ్యంతరం, మొదలైన విపరీతాలు ప్రబలాయి. దేశంలో జాతి నిర్జీవమై, స్వేచ్ఛనీ, సుఖాన్నీ, పోగొట్టుకుని ఈ

లోకాన్ని సాధించే చావలేక, ఇంక వదులుకోడంలోనే స్తిరత్వంలో జడత్వంలో శూన్యం లోకిపోయి దాక్కునే మూలుగుఅది. ముసలివాళ్ళకీ, జీవితంలో పెద్దదెబ్బతిన్న వాళ్లకీ కలిగే నిర్వృత్తి అది. శంకరాచార్యులు చెప్పేదాంటో నిజంలేకపోలేదు. దుర్మార్గమల్లా అతని emphasis లో. ఆ ఆధ్యాత్మికానందమేదో, అది దొరికితే, దాంటో వాళ్ళు, చెప్పే గొప్పరసమే వుంటే, వేరే వైరాగ్యం బోధించవలసిన అవసరమే లేదు. ఆ ఆధ్యాత్మిక సాధనలో వున్న ఏ పదిమందికో, తాత్కాలికంగా శరీరసుఖాన్ని అరికట్టుకోడం అవసరమూ కావచ్చు. ఆపేక్షకి వెళ్ళేవాడు ఆ పనిమీద చీట్లపేకలూ, మానెయ్యకలిగిరావచ్చుకాని ఆ కారణంగా ప్రతిమనిషిని సినిమాలు, చీట్లపేకలూ, ఆటలూ, సరసాలూ మానుకోమనడం మూర్ఖం. దుర్మార్గం. జీవితంలో సారం పిండెయ్యడం. ఆ వైరాగ్యమార్గం జనులలో ఇంత ఆదరణ పొందగలిగిందంటే, అది చూసి జాతి క్షీణతకి దిగులు పడాల్సిన విషయంగాని, గర్వపడవలసిందికాదు. లోకం మాయ అనే దాంటోనూ సత్యం వుండవచ్చు. జీవితం క్షణ భంగురమూ అవును. కాని వాటంత విలువలూ, వాస్తవమూ వుంది. లోకం నిజం జీవితం సుఖమయం. జీవితం వందయేళ్ళు, హాయిగా అనుభవించు అనడంలోకూడా ఒకటే సత్యమని ఎక్కడ వుందోగాని, జీవితమార్గంలో అనేక సత్యాలున్నాయి. స్త్రీ శరీరం వుత్త మాంసం అయినమాట నిజమే. శరీరపుకాంతి, మృదుత్వమూ, శృంగారం, ఆహ్లాదం ఇవన్నీ అంతకన్నా నిజాలు. ఆ మాంసం సంగతే మనసులో పెట్టుకొని, యీ విలువల్ని చూడలేని మనిషికన్న దౌర్భాగ్యుడు వుండడు. సంసారం దుఃఖసాగరమే. కాని ఆ సాగరాల్నిమించిన మహాసాగరాలవంటి సుఖాలున్నాయని గుర్తులేని మనిషి ఎంత అంధుడు.

ఉన్న సుఖాలలోంచి, అంతకన్న ఎక్కువ సుఖాలకి ప్రయత్నించాలి. ఆధ్యాత్మిక విద్య అన్నిటికన్న గొప్ప సుఖమిస్తే, అది చాలా వాంఛనీయం. అది దూర, ఎవరో దాన్ని అనుభవించిన వాళ్ల మాటలే ప్రమాణం. వాళ్లూ అది ఇట్లాంటిదని రూఢిగా మనకి చెప్పలేదు. మనకి అందదంటారు. కబీరు దాన్ని మకరందంతో, వెన్నెలతో సంగీతంతో అమృతంతోపోల్చి మాట్లాడతాడు. కాని గొప్ప ఎక్కడంటే; లోకం ఇవ్వగల ఉన్నత సౌఖ్యాన్ని, ధనాన్ని, శృంగారాన్ని, పదవుల్ని అన్నిటికీ అనుభవించి అంతు కనుక్కున్నవాళ్ళు ఆధ్యాత్మికానుభవంతో ఏ ఏ మూలా తుల తూగదంటున్నారు, చాలా ఘంటాపథంగా. మరి వాళ్ళన్నా మోసపోవాలి. మననన్నా మోసం చేయాలి. మన దేశంలోనే కాదు, అన్నిదేశాలలో, మతాలలో, కాలాల్లో

mystics అందరూ అదే పదం పాడుతున్నారు. దేనికీ నమ్మని Aldows huxley, మన మౌనుల్ని చూసి, "వాళ్ళు దేనిని కోరక, లక్ష్యపెట్టక ఏదో ఏదో మహాలయంలోకి పోతారు. అట్లాంటి స్థితే, మనకి దాతనైతే.అంతకన్న ఏంకావాలి? మనదేశాల్లో కూడా అట్లా ఏదో నిద్రలోకి పొయ్యే మనుషులున్నారు. కాని అది వాళ్ళకెట్లాగో తటస్థించిందిగాని, మార్గం మనకి చూపలేరు- ఈదేశంలో దానికి సాధనాలున్నాయి. మార్గంచూపే గురువులున్నారు'' అని వ్రాశాడు.

ఆధ్యాత్మిక విద్య అదోవిద్య. దాని మార్గాలూ, మెట్లూ అన్నీ వ్రాశారు మన దేశంలో. కాని చుట్టూ వైరాగ్యాలూ మతాలూ, పూజలూ, మూఢత్వాలూ. శుశ్రూషలూ అల్లుకున్నాయి. దాంతోపాటు దేవుడూ, నీతీ, పరలోకాలూ, ఆత్మలూ, విశ్వాసాలూ కలిపారు. వాటినన్నింటినీ తొలగించి, దాన్ని వుత్త విద్యగా విడదీసి, సాధనకి ఆలయాలు స్థాపించాలి. తక్కిన విద్యలమల్లేనే అది అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కాని అర్హులైనవారు యీ తుక్కు non sense తో గొడవలేకుండా, శుభ్రంగా ఆ దీక్షతో నేర్చుకోడానికి వీలు కలగాలి.

చాలావరకు ఆధ్యాత్మిక విద్య అంటే subconscions ని తరచడంలాగ తోస్తుంది.Psycho-analysisవెళ్ళినకొద్దిదూరాన్ని పట్టిపరిశీలిస్తే, ఈఆధ్యాత్మికవిద్యవల్ల కలుగుతాయని, మౌనులు, రుషులూ, చెప్పే ఆనందాలూ, మహిమలూ ఏమాత్రమూ అతిశయోక్తులు కావనిపిస్తుంది.

ఏకాగ్రతతో శ్రీరాముని ధ్యానిస్తే శ్రీరాముడు ఆభక్తుడికళ్ళకి కనపడే మాట సత్యంలాగే వుంది. కాని ఆతని కళ్ళకి కనపడేందుకు శ్రీరాముడు ఎక్కడో వుండనక్కర్లేదు. అతని మనసులో వున్నాడన్నమాట చాలు-గొడవ ఎక్కడొస్తుందంటే, తనకి కనపడ్డాడు కనక, శ్రీరాముడు నిజంగావున్నాడనడమూ, మననందర్నీ నమ్మమనడమూ, ఆధ్యాత్మికవిద్యా అంతేకావచ్చు. ఎక్కడో, ఆత్మలో సుఖంవుంది అని నమ్మి. ధ్యానిస్తే ఆ సుఖం వున్నట్లు కనపడవొచ్చు. కాని వున్న శ్రీరాముడుకనపడ్డా నాకేం రాదుగాని, లేనిసుఖం నాకు వున్నట్లు కనపడ్డా నాకు సుఖమే. ఈసుఖాలన్నీ ఎక్కడినుండి ఏడిశాయని మనస్సులోగాక? మన మనసుకి నిరంతరసుఖం కలిగించుకోగల శక్తి దొరికితే అంతకన్న ఏంకావాలి?

నేను లోకైక చక్రవర్తినని నమ్మి;, దాంతో ఏదీ నన్ను చలింపచెయ్యనంత పిచ్చి నాకు ఎక్కితే అంతకన్న నాకు ఏంకావాలి?నేను పిచ్చివాణ్ని మీకందరికీ -నాకు

నేను పిచ్చివాణ్ణి కానంతకాలం, నాకేం బాధ! షాంపెయిను తాగితే, బైటినుంచి ఏకార ణమూ లేకుండానే, జీవితం ఘోరంగావున్నా ఆ గంటలు గొప్ప సౌఖ్యంగా వుంటాయి. నాకు ఏ ఖర్చూ అనారోగ్యం లేకుండా, విరామంలేకుండా, మళ్ళీ తెలివిరాకుండా, నిరం తర షాంపెయిను ప్రమత్తుణ్ని కాగలిగితే, అంతకన్న నాకేంకావాలి? ఆకలి, దేహ బాధ, నాబాధలు, ఏవీ లక్ష్యం లేని అంటని స్థితి కలుగుతుందంటారు ఆత్మసాధనలో. ఆ సాధనతో మొద్దునైపోతే ఇష్టముండదుగాని, అవేమీ లక్ష్యంలేని ఆనందంలో వుండ గలిగితే?

కాని చాలామంది ఈ సాధకులలో లోపల ఏంజరుగుతుందోగాని పైకి జడత్వం కనపడుతుంది. వుత్త నిద్రమత్తు వుత్త బాధల్లోంచి, పేదరికంలోంచి, వొంటరితనంలోంచి తప్పించుకునే స్థితిలాగే కనపడుతోంది. ముష్టికి తిరిగేవాళ్ళూ, మఠాలలో కూచున్న వాళ్ళూ యీ బైరాగుల్ని, సన్యాసుల్నీ చూస్తే ఏ మొద్దుతనంవల్లనో, ఏదో బాధలేని స్తిమితం నేర్చుకుని కూర్చున్నట్టుంటారు, ఆలోచించగా నాకేమనిపిస్తుందంటే, ఆధ్యా త్మిక విద్యకి తగని మనుష్యులు ఊరికే, ముక్కి, ముక్తి, ప్రయత్నంచేసి సౌఖ్యాలూ వాంఛలూ. తెగనరుక్కుని అట్లా తయారౌతారనిపిస్తుంది.

మళ్ళీకొందరు సాధకుల్ని చూస్తే, గొప్ప రసజ్ఞాన్నీ, జ్ఞానుల్నీ ప్రతిభావంతుల్ని చూసినదానికన్న గొప్ప అనిపిస్తుంది. భగవాన్‌ని చూస్తే లోకంలో అందం, అధి కారం, శాంతి, క్షమ, దయ, ప్రేమ, అన్ని విలువల్ని అవలీలగా తనలో ఇముడ్చు కుని, దాటి, ఏదో విశ్వతేజస్సులో వెలుగుతున్నట్టుంటుంది.

ఈ ఏకాగ్రతవల్ల సంపాయించే శక్తి దుర్మార్గానికి లోకక్షోభకికూడా సాధ్య మయ్యేట్టు కనబడుతుంది. వరాలుపొందిన రాక్షసుల్లో, వరాలిచ్చే పతివ్రతల కథల్లో ఇదే కనబడుతుంది. దీన్ని హిట్లరు సాధించాడని కబుర్లాడుతున్నారు, యీ దేశపు విద్వాంసులు అందువల్లనేగావును ఈ సాధనకి సహాయంచేసే గురువులు, శాస్త్రిలూ, నీతి అనీ, లోకక్షేమమని, వాంఛారాహిత్యమని, దేవుడనీ, పాపమని ఇన్ని జాగ్ర త్తలు తీసుకున్నారు. పుటకవల్లనో, గురువు సహాయంవల్లనో, సాధనవల్లనో, అద్భు తమైన శక్తుల్ని సంపాయించిన మనుషుల్ని చూస్తాము. ఓ ఖురాడు గొప్ప magic- ఎంత ప్రయత్నించీ, చేతి కుశలతతో మోసంతో, అర్థం చెప్పుకోలేని trick చూపాడు. అతనితో వొంటరిగా మాటాడి అడిగాను. ఒకటి రెండు tricks ఎట్లా చేశావని.

"ఆ వుంగరం అక్కడలేదు, మీ కళ్ళకి వుందనిపించేట్టు చేశాను." అన్నాడు.

'ఎట్లావొచ్చింది మా మనసులమీదా కళ్ళమీదా నీకా అధికారం?'

'సాధన'

'ఎవరు నేర్పారు?'

'మా గురువు?'

ఆ సాధనకి మామూలు ప్రారంభం, గోడమీద చుక్కపెట్టి తదేకదృష్టి యిట్లాంటివి.

ఇట్లా సాధనలు, మంత్రాలు, యోగాలు — దూరశ్రవణం, భూతభవిష్యత్తులు చూడడం, మన్నుని కర్పూరంగా మార్చడం, ఇట్లాంటివి, మాయలుగాక, తమమనో శక్తి వల్ల కలిగించగలిగినవాళ్ళు, రోగాలు, దెయ్యాలు నయంచేసే వాళ్ళున్నారు. కాని ఏ విద్య కావిద్యే. అంతకన్న వాళ్ళకేంరాదు. వాళ్ళు సాధించలేరు. టోపీలోంచిరూపా యలవర్షం కురిపించిన మనిషి, మనం పడేసే కాసులేరుకుంటాడు.

## 10

పిచ్చికలు, గోరింకలు ఎన్నోరకాల అరుపులు అరుస్తాయి. ఒక కొమ్మమీద కూచుని ఒక అరుపు, మరో కొమ్మమీదికి గంతేసి యింకో అరుపు. గదుల్లో గూళ్ళు కట్టే పిచ్చికల అరపుల్ని ఒక సంవత్సరం ఆదేపనిగా వింటే పిచ్చిక భాష dictionery వ్రాయవచ్చు ననుకుంటాను.

తుపాకి పేలింది. మెల్లిగా ఆకాశాన్నించి రాలే నల్లని కన్నీటిచుక్కలవలె దీనంగా నీళ్ళమీద రాలాయి పక్షులు. నీళ్ళమీదనుంచి మళ్ళీ గాలిలోకి లేవాలనిచూసే ఆ నిర్భాగ్యుల్ని పట్టుకుని లాక్కొచ్చి పడేశారు పడవలో. కన్నీళ్ళతో నా వొళ్ళోకి తీసుకున్నాను. యింకా వెచ్చగా కదులుతున్న కళేబరాల్ని. ఆ యీకల అందం, ఆ మెడల త్రిప్పు, ఆ రొమ్ము సౌష్ఠవం, రెక్కల వొంపు. అంతా చివరికి యిందుకా? దువ్వాను. పొరలుకమ్మే కళ్లల్లోకి చూశాను. రొమ్ముకు అద్దుకున్నాను. నా చేతుల్లో చల్లబడ్డాయి.

ఈ చిన్నపిట్టల్లో, చంపడానికి వచ్చినపుడు తప్ప మనిషి కంటబడని పిట్టల్లో యీ అందాలేమిటి యీతళుకు యీనునుపు? పైగా తమ ఆనందంకోసం యీ సృష్టి జరిగిందని కులుకుతున్నారు. ప్రపంచంలో సగంమంది. ఎవరు చూడడానికి? ఒకపిట్ట

యింకోపిట్ట అందాన్ని చూడగలదా? దేవతలు చూస్తారా? యింత అందాన్ని యిట్లా నాశనం చేస్తూవుంటే చూస్తూ వూరుకున్నారా దేవతలూ, ఋషులూ, దిక్పాలకులూ? యిట్లా నాశనం కావడానికి యింతశ్రమ? అందమైన పిల్ల పుట్టగానే చచ్చిపోతూవుంటే ఈ సృష్టి విధానాన్ని నడిపేవాడువుంటే, ఇంత నిస్సహాయంగా, తాను నిర్మించిన సౌందర్యాన్ని తానే నాశనం చేస్తాడా అనుకుంటాను —

అందమనేది వుందా? నా కంటోగాక బైటవుందా. దేవుడికి కనబడుతుందా? దేవుడే లేకపోతే ఏదో పక్షులు రావచ్చుగాని, అందం ఎట్లావొచ్చింది! నామనసులో సౌందర్య భావానికీ, పిట్టల రెక్కల నునుపుకి సంబంధం ఎట్లాకలిగింది?

దేవుడువుంటే సౌందర్యంమీద వుపేక్షా, నిరసనా, ద్వేషమా అతనికి? ఇన్నేళ్ళూ వాటి అందం ఎవరుచూసి సంతోషిస్తున్నారు! చివరి నిమిషంలో చంపబోయేప్పుడు ఒక్కనిమిషం నా కళ్ళు చెదరకొట్టేందుకా, అన్ని యుగాల ప్రయత్నం evolution! పక్షి అందాన్ని కల్పించేందుకు, నేనూ, నా సౌందర్యదృష్టి అంత ముఖ్యమా! ప్రపంచంలో......నేను-ఒక్క చిన్నదెబ్బతో-అంతా ముగిసే నేను-పురుగు కన్న నాజూకు ప్రాణంగలనేను-నేనే-అంత విలువా దేవుడికి? తక్కినవాళ్ళూ! నదుల్లో, పిల్లలలో, పిట్టలలో ఏ సౌందర్యం చూడనివాళ్ళూ, కంది పచ్చడిలో, చీకటిమంచాల మధ్య తప్ప; ముఱుగువాసనల్లో, నంగి మాటల్లో తప్ప అందం కనపడని యీ "children of god" సంగతేమిటి!

ఏం జరిగింది? ఏమిటి ఆగింది? ప్రాణం పోయిందా? ప్రాణంవుందా పోవడానికి? ప్రాణం ఆ శరీరనుంచివేరా? ఆశరీరంలో నివసించిందా?ఇప్పుడు వేరై యింకాప్రత్యేకంగా యింకో ఆత్మగా Exhist అవుతోందా? ఎక్కడో యీ ఆకాశంలో?ఆత్మ అనేదివుందా? పిట్టలకి కూడానా? ఇట్లానే వాదించా,పంగనామాలపందికొక్కు హెడ్మాష్టరుతోఒకసారి. ఆత్మ పురుగులకి, దోమలకి, యింకా సూక్ష్మ జీవులకి, భూతఅద్దంకింద కనబడే జల జీవులకి, క్షయ జీవులకి, మనరక్తంలో యెర్రని కణాలకి, మన శరీరంలోని ప్రతి Cell సెల్‌కి, గడ్డికి, ప్రతి గడ్డిమొక్కకి, గడ్డిమీద ఆకుపచ్చతనాన్నిచ్చే అణువులకి, క్లోరఫిల్‌కి, protoplasm కి, రాళ్ళకి, రాళ్ళలోని రజానికి? జవాబు చెప్పమను? ఎక్కడ గీత గీస్తావు ఆత్మవున్న వొస్తువు, లేని వస్తువు అని? మనకి ఆత్మవుంది. మనశరీరంలో cell కి వేరే జీవంవుంది. అది అందరికీ తెలుసు. వాటికి వేరే ఆత్మలా? ఏది నాఆత్మ నా శరీరంలోని కోట్లకొలది జీవరాసుల్లో!అంతా ఒకటే పరమాత్మ స్వరూప

మని తప్పించుకుంటారు, వేదాంతులు. సులభం. కాని వాదించమనండి. సరేకాని కొన్ని జీవాత్మలున్నాయిగా ! అవి వేటికి? మనుషులకేనా? అంతేనంటారు క్రిష్టియనులూ, మహ్మదీయులూ! ఐతే కొండమనుషులకి? మనుషులవంటి కోతులకి? ఇంకా దిగిపోతుంది స్కేల్! ఇదంతా ఎవడికీ అర్థంగాని విషయం. అర్థమౌతుందన్నవాణ్ణి, తనకి తెలుసునన్న వాణ్ణల్లా ప్రశ్నలడిగి నోరుమూయించి మొహానవుమ్మేసి, యీ మతాలగర్వం అణిస్తే బాగుపడుతుంది లోకం.

# 11

నాముందు కొలనులో లేయెరుపు తామరలు మెల్లిగా తెరుచుకుంటున్నాయి, సరిగా సమయానికి యేశక్తి యీ పువ్వుల్ని వికసింప చేస్తుందో ఆశ్చర్యంకాదూ! జంతువులకి మాత్రమే ప్రాణమున్నట్లూ యీ వృక్షాలని యెన్నిటిని చంపినా యేమీ తప్పుకానట్లు మాట్లాడతారు, మాంసభక్షణచెయ్యని నిర్మలోదరులు! చంపి తినకండా బతకలేము చెట్లనో మృగాలనో. అనవసరంగా చెట్లని చంపడం, అవసరంగామృగాలని చంపడంకన్నా చాలా పాపమని గుర్తించలేరు, ఎవరో జంతుబలులు జరక్కుండా శాసనం చెయ్యాలనే వాళ్ళకి యెంత దయ జంతువులమీద! పంజరాల్లో-చిలకల్ని వదలమని సత్యాగ్రహం చెయ్యరాదూ? zoo "జూ"లో జంతుప్రదర్శనశాలల బోనులు విరగతన్నరాదా? సర్కసులకి మనుషుల్ని వెళ్ళి చూడవద్దని ప్రచారం చెయ్యరాదూ? బలిపడే జంతువుల రెండు సెకండ్ల బాధ పెద్దపులులు నాలుగు గజాల బోనుల్లో యావజ్జీవనమూ పడే బాధలో యెన్నోవంతు? కటికవాడి చేతుల్లో చచ్చే పడుచు ఆవు బాధకన్న, గోసంరక్షణవాళ్ళ ఆత్మలకి స్వర్గంవొచ్చేందుకు, ఊరేగింపులో కాళ్ళీడ్చుకుంటో తిరిగే ముసలి రోగిష్టి ఆవుల బాధ యెన్నిరెట్లు?

ఇదంతా తెలీదు. తెలుసుకోరు. అంతా మతం, శాస్త్రాలూ, అన్నిటికన్నా "సెంటిమెంటు" మెదడు చాలా మందికి పెట్టడం మరిచిపోతాడు, చేసే ఆయన.

హృదయాల్లో నిజమైన దయాస్రవంతి వుదయమైనప్పుడు జంతు బలులవేపు కాదు; దిన దినమూ మన యెదుట జరిగే నరబలులవైపు ప్రవహిస్తుంది ముందు.

జంతువులు నోరులేనివి. చెట్లూ! గొడ్డలికింద రక్తంకారే చెట్టు, బూడ్సులకింద నలిగే గడ్డి, పువ్వులన్నీ కోసుకుపోతే యేడ్చే మొక్క వీటి మీద కారుణ్యం లేదా? నోరు లేదు గనుకనేనా?

ఏం తింటున్నాము, ఏం చంపుతున్నామని కాదు ప్రశ్న! హృదయంలో యెంత దయ, యెంత సానుభూతి వుందనేదే ముఖ్యమైన విషయం. ప్రజలని కొరుక్కు-తినకపోతే చాలు దయాపరులు!

పుస్తకాల్లో యీనాటికికూడా నవకవులు సహితం ఉదయాన తామరలు వికసించడమూ, రాత్రులు కలవలు పుయ్యడమూ, పద్యాలలో వర్ణిస్తోవున్నారా! అట్లాలేదు, నిజంగా, యీ చెరువుల్లో పువ్వుల్నిచూస్తే కలవలు పగలు వికసించి లోకంలో కవులందర్నీ ధిక్కరిస్తున్నాయి. తామరలు సాయంత్రమైనా వికసించే వుంటున్నాయి, ఖండకావ్యాల్నిచూసి యేమాత్రమూ భయం లేకుండా. కాని గొప్పగొప్ప వారమని విర్రవీగే కవులు యింకా కృతయుగంనాటి వర్ణనల్లో మూలుగుతూ వుంటారు. చకోరాలు, హంసలు, కలవలూ, గండభేరుండాలు, తంగేటి జున్నులు, చక్రవాకాలు నవకవిత్వం నిండా. మతంపేరట యేవికృతమైనా చలామణి ఐనట్టే కవిత్వం పేరట ఏ అసందర్భమైనా మెప్పు పొందుతుంది.

## 12

ఈనాడింకో కొత్తమతం బైలుదేరింది మానవత్వం. ఇది చాలా సుఖమైన మతం. దీని ఉద్దేశ్యం మానవాభ్యుదయం. ఇది మానవుణ్ణి సుఖంలో, అంటే శరీర మానసిక సుఖంలో ప్రతిష్టించే మతం. ప్రతివారికీ ఇల్లూ, బట్టా, తిండీ, భార్యా, పిల్లా, దినపత్రికా వోటూ సప్లైయిచేసే మతం. దీంటో మానవులే చేరతారు. కోతులూ, పురుగులూ, పశులూ చేరవు. సృష్టినంతా మానవుడికోసం, అతని ప్రయోజనం కోసం, ముఖ్యం పొట్టనింపుడు కోసం వుపయోగించాలి అని. ఆప్రయత్నంలో తక్కిన ప్రాణాల్ని నాశనం చెయ్యవొచ్చు. అభ్యంతరం చెప్పిన మానవుల్నికూడా. పోనీ మానవుణ్ని మాయం చేస్తేనేం? వీల్లేదు. తానూ మాయం కావలసివొస్తుంది.

"దున్ను, దున్ను, తవ్వు, తవ్వు, తిను, కను" ఇదే బోధ.

వీరికి దేవుడులేడు. చావు తరవాత బతుకులేదు. వుంటే, చాలా ప్రశ్నలు బైలుదేరతాయి. చేసే ఘోరాలకి నింపుకునే స్వార్థానికీ, జవాబు చెప్పాల్సివస్తుంది. కాని చావు భయం. అయిష్టం. అందుకని వీరు మానవత్వంలో బతుకుతారు. చచ్చీ ఇతరుల్లో అనుభవిస్తోనే వుంటారు, చస్తేనేం? నా తెలివి, నా మోసం, నా ఘనత-ఇంకోరిలో అనుభవిస్తాను ముసలి బోగందానిమల్లే.

ఈ మానవత్వం వుంటే, ఇది మనిషికి చాలా సుఖమైన మతాన్నిస్తోంది. అతని మోసానికీ స్వమోసానికీ చాలా ఉపయోగపడుతోంది. అతని అహాన్ని అమితంగా పెంచుతుంది. పరమత ఖండనకి చాలా ఉపయోగం. తన సమర్థతకి, తన స్వార్థానికి, తన దేహ లంపటుత్వానికి, ఇంద్రియాల దేవుళ్ళాటకి ఎంతో సహాయపడుతుంది.

"ఏం రాస్తున్నావు రచయితా?" మానవాభ్యుదయ గీతాలు—

"ఏం చేస్తున్నావు మంత్రీ?'' మానవాభ్యుదయానికే ఈపదవీ, ఈదగా?

''నీకింత జీతమెందుకు సయన్టిస్టూ?'' మానవాభ్యుదయానికి food research చేస్తున్నాను. వీరు మానవుడి కోసం ఏమీ నొదులుకోనక్కర్లేదు. తమకు దక్కింది తాము గట్టిగా దాచుకొంటారు,

''మానవులందరూ సమానులు కదా? అందరికీ వుండాలికదా? నీకిన్ని luxuries ఎందుకు?"

"అందరికీ తెప్పించడానికే నా ప్రయత్నమంతా?''

"ఇప్పుడు లేవా? నీవి కొన్ని పంచరాదా?"

"ఎందుకు పంచడం—త్వరలోనే అందిరికీ వొస్తాయి"

తిండీ, కులాసా తప్ప ఇంకో విలువలున్నవారు పిచ్చివారు.

"నీకిన్ని సుఖాలెందుకు, ఉద్యోగీ?" మానవాభ్యుదయానికి పరిపాలిస్తున్నాను—

మానవాభ్యుదయం గాళ్ళకి ఒక్కరికీ మానవుడిపైన దయలేదు—వుండదు—

"పాపం దిక్కులేక చస్తున్నాడు బిచ్చగాడు."

ఏం చేస్తాం? త్వరలోనే యిదంతా మార్చేస్తాం, నోట్లో రెండణాల ఖరీదుగల సిగరెట్టు ఆడుతోంది.

"పాపం ధరలు హెచ్చాయి, కొనలేక గుమాస్తా మాడుతున్నాడు."

"జీతాలు హెచ్చుచేసేందుకు ఆలోచించడానికే వెడుతున్నాను. అతి తొందరగా నా delux కారులో.''

"పాపం, పరీక్షలకు చదివి, ఆరోగ్యాలు నాశనమౌతున్నాయి పిల్లలివి." చేస్తాం చేస్తాం ఈ చదువుల్ని సంస్కరిస్తాం. వుండండి. నా కొడుకుని అమెరికా పంపాలి. ఢిల్లి పోతున్నాను scholorship కోసం.

"ఏమిటయ్యా, రేడియో అధికారి, ఏం చేస్తున్నావూ'' — మానవాభ్యుదయ ప్రసారం. మొన్న ఒక టాకు నిచ్చేనే మీ బావగారికి? రేడియో ప్రజల విజ్ఞానానికేగా"

"విజ్ఞానాన్ని వెదజల్లడానికి ఆ కారూ సూటూ ఎందుకు?"

"ఈ ఉద్యోగం ఎట్లా సంపాయించా ననుకున్నావు? గోలచెయ్యకు; నీకో టాకు కావాలా? ఎంత ఇసావు నాకు!"

"ఓ పత్రికాధిపతీ! బీదలకోసం, మూర్ఖులకోసం leaders రాసే ప్రభువా, అన్ని కన్నీళ్ళు కారుస్తావే కాయితాలపైన, ఏదయ్యా. ఒక అణాఇయ్యి"

"మానవాభ్యుదయం చేస్తో చాలా busyగా వున్నాను. నా రాతలతో ఈ దేశపు దృష్టినే మార్చాను తెలుసా? నా ఆఫీసు అందంగా లేకపోతే, colour scheme ఏ మాత్రం లోపించినా నాకలం సాగదు.''

ఇది మానవాభ్యుదయం.

ఏది కీర్తి, ఏది డబ్బు, ఏది అధికారం. ఏది ఇంద్రియ లాభం? ఏది గొప్ప? ఏది popular దాన్ని వాసన చూసుకుంటో పోతున్నాయి, ఈ ప్రజాప్రేమికుల ముఠాలు.

నిన్నటిదాకా ఒక chance కోసం అగచాట్లుపడ్డ—దర్శకులదాకా అక్కర్లేదు—నటీనటకుల్ని కదిలించండి—

"మానవాభ్యుదయానికి మా జీవితాలు మా రక్తం ధారపోస్తున్నాము. కళ! పూజ్యమైన కళని వుద్ధరించాలని, కళద్వారా, దేశసేవ,మానవసేవ చెయ్యడానికే మేము నిరంతరం కృషిచేస్తున్నాము."అనగానే పూలహారాలూ,చప్పట్లూ-ఎవడూవాళ్ళమొహాన నవ్వడు. అందరికీ అదే ఆశ? ఏదోవిధంగా సినిమాలలోచేరి జీవితాలు త్యాగం చెయ్యాలనే మానవాభ్యుదయం, లోకకళ్యాణం చెయ్యాలనే వాళ్ళ ఆశ.

సినీమాలో దివాలా తీసినవాణ్ణి, స్థలం దొరకని వాణ్ణి ఎవడూ అడగడు—ఎందుకు ఈ గతికి వొచ్చావని! అతను జవాబు చెప్పడు—మానవాభ్యుదయం చెయ్యబోయి కళాదేవికి బలిఐపోయినానని.

ఒక్క కాలుపైన ధర్మం నడుస్తుందనుకునేరు, ఆ కాలూ కుంటిదైపోయింది. భూమాతా, ఎన్నిసార్లో వైకుంఠంలో మొర పెట్టుకున్నావు, భూభారం పెరిగిందని! ఈ నాడు నీకే భారమూ తోచడంలేదా? లేక నువ్వూ కాలవలూ, ఆనకట్టలూ, రైళ్ళూ, విమానాలూ, భూషణాల కింద తగిలించుకుని కులుకుతో సినీమా చూడపోయినావా?

మానవుడు తెలుసుకోని దేమిటంటే, తెలుసుకోవడం ఇష్టంలేని దేమిటంటే—నీ హృదయంలో ఏం జరుగుతోందని! ఏం చేస్తున్నావని కాదు—నువ్వేమౌతున్నావని! నీ motives ఏమిటని?

Not the end, but the means అని గోలకెత్తిన గాంధీగారి spiritual సంతతా ఇది!

గుండెలోకి చూసుకో—

కులం అనేది పలక్కుండా పోయిందా దానిలో? కలం చెడ్డదని ఉపన్యాసాలూ, భోజనాలేనా?

స్త్రీ పైని గౌరవం వుందా?
లేక సీలకి ఉద్యోగాలూ, బిడ్డలూ ఇవ్వడమేనా?
మానవత్వపు అరుపులేనా?—
లేక కష్టంలోవున్న మానవుణ్ణి చూసి, నిన్ను మరిచి నీరౌతున్నావా?
స్వతంత్రం— అని రాయడమేనా!

ఏ మనిషినీ, మృగాన్నీ, నీకింద పని అతన్నీ, నీ భార్యనీ, పుత్రుణ్ణీ బాని సత్వంనించి తప్పించాలి. "బాధలన్నీ తీసేస్తాను —" అని అరుపేనా, లేక ఏ వొక్క మనిషికో, మృగానికో నీ చేత్తో బాధని తీసేశావా, నిండు కనికరంతో.

నిన్ను మరిచి ప్రేమించావా, దేనినైనా ఇంతవరకు!

## 13

ఈనాడు ధనం దాచుకునే, గొప్పగా అనుభవించే భాగ్యవంతులమీద తమ హక్కుల్ని దోచుకున్నారని ఆగ్రహిస్తున్నారుగాని, పరిశీలిస్తే, intrinsic values దగ్గరికి వెళ్ళిచూస్తే, వీళ్ళకీ ఉత్త ఈర్ష్యతప్ప, తమకులేనిది ఇంకొకరికి వుండిపోయిం దనే ఆగ్రహం తప్ప, యీ సుఖదుఃఖాలలో మనిషికీ మనిషికీ అట్టే తేడాలేదనే విశాల దృష్టి లేదేమో! జీవితమంతా అలవాట్లపుట్ట. ఆ అలవాటే ఎంతబాధలోనూ, దరిద్రం లోనూ వుండే చురుకుదనానికీ నల్లమందు పూత పూస్తుంది. ఆ అలవాటే ఎంత ఐశ్వ ర్యంలో వుండే ఆనందాన్నీ మామూలుచేసి ఆత్మని తీరనికోర్కెలతో క్షోభ పెడు తుంది. మహారాజు భోజనపదార్థాలకీ దరిద్రుడి భోజనపదార్థాలకీ లక్షభేదం వుండ వచ్చు. కాని వాటి ఆరోగ్యపు విలువగాని ఆనందపు విలువగాని సమానమేకావచ్చు. లేక పోవడంలో లేదుబాధ, లేదని యేడవడంలో వుంది బాధఅంతా. అవసరంగాకావల సిన వాటికి ఏడవకుండా వుండడంచాలాకష్టం. కాని ముప్పాతిక ప్రపంచంలోదుఃఖం అవసరం లేనివాటికి ఏడవడం వల్లనే కలుగుతోంది. ఈ వైభేషజాలని తొలగిస్తే అన్ని

దేహాలూ వొకటేఐనట్టు, పై మెరుగులు తీసేస్తే మనసులన్నీ ఒకటేనేమో! మనస్వంత మనసులే దుఃఖిస్తున్నాయో, సుఖిస్తున్నాయో కనుక్కోలేమే, ఇతరుల సంగతి మనకేం తెలుసు? మేడలుచూసి, సుఖమని, గుడిశలుచూసి, దుఃఖమని మన మనసు విభజించుకుంటుంది. అంతే!

## 14

స్వేచ్ఛ! స్వేచ్ఛ! స్త్రీలకిస్వేచ్ఛ, పిల్లలకి స్వేచ్ఛ! కార్మికులకి స్వేచ్ఛ! మామూలుమాటలు, ప్రతినోటినుంచి యీమాటలు. ఆ స్వేచ్ఛాదేవత ప్రత్యక్షమయిందా, కావలసినస్త్రీ, పెంచినపిల్ల, పోషించిననౌకర్లు. సాకుతున్నకుక్క- రూ పా న స్వేచ్ఛ కావాలని ఎదురుతిరిగి కళ్ళముందు నిలపడ్డదా, ఆదర్శాన్ని భరించగల మనుష్యు లెంద రున్నారు? స్వేచ్ఛ! ప్రతివారికీ స్వేచ్ఛ! ఎక్కడవుంది ఆస్వేచ్ఛ జీవితంలో? బంధం నించి బంధనానికి పాకితేనేగాని నిలవలేని యీ బతుకులో! మాయమీద మాయ కల్పించు కొని కప్పుకుంటేనేగాని కళ్ళుతెరవలేని యీ ప్రపంచంలో!

ఈ పారతంత్రపు స్త్రీలు వేశ్యల్ని అనుకరించాలని ఎంతో ప్రయత్నంచేస్తారు- ఒక్క ఆకారంలోనే కాదు, వేశ్యలు కొన్నాళ్ళు బోర్డింగు స్కూలు పిల్లల్ని అనుకరిం చారు. కాని ప్రస్తుతం అందరూ కలిసి సినిమా స్టార్లని ఆదర్శంగా పెట్టుకున్నారు. జుట్టుపైకి కట్టడం, పువ్వులు కిరీటాలవలే గుచ్చడం: ఇవన్నీ తమ ఆకారానికి సరి పోతాయా లేదా అని యోచించరు. ఎందుకీ అలంకారం? ఎవరికోసం అని ప్రశ్నించు కోరు. ఈ జనరేషన్ స్త్రీలు యిట్లా కళ్ళముందు మారిపోతూవుంటే వాళ్ళనేమి అనలేక యెట్లా అభ్యంతర పెట్టాలో తెలీక, గుడ్లుమిటకరించి చూస్తో, ఊరుకుంటున్నారు, పెద్ద ముత్తయిదులు.

## 15

నియమాలు, నియమాలంటారే అదంతా చాలమటుకు saving one's face. నిజమైన నియమాలు మనస్సులోనే వుంటాయి. కాని బైటికి రావు. కనుక అవసరమై నప్పుడు ఎవరికీ తెలీకుండానే వాటిని సులభంగా వొదులుకోగలరు. కాని యే నియమా లకై మనిషి ప్రసిద్ధి కెక్కాడో వాటిని వొదులుకోలేడు మనిషి. అంటే ఆ కీర్తినీ మాపుకో లేడు. దాతఅనే కీర్తిని పొందిన మనిషికి యాచకుణ్ణి పొమ్మనే ధైర్యం వుండదు. మనని

మన నియమాల్నీ ప్రపంచమంతా చూస్తున్నారనీ, గౌరవిస్తున్నారనీ అనుకుని ఆ పీఠం నించి యెక్కడ చ్యుతి కలుగుతుందోనని భయపడి 'నియమం, నియమం చాలా వున్నత మైనది. దాన్ని తప్పకూడ'దని సమర్థించుకుంటారు. అట్లానే చాలామంది నియమాలు వారి అవసరంకొద్దీ, నమ్మకాలకొద్దీ వారు ఏర్పరచుకున్నవి గాక ప్రజలు వారిపైన విధించినవియై వుంటాయి.

నిజమాలోచిస్తే మనని గురించి చాలా కొద్దిమంది - అదికూడా యే నిమషాన్నో తలుచుకుంటారు. మనని ఎక్కువగా తలుచుకునే వారు మనని ద్వేషించేవారై వుంటారు. కాని మనమనసుకి ప్రపంచమంతా మనకార్యాలూ ఆలోచనలూ ప్రతి నిముషమూ కని పెడుతున్నట్టే వుంటుంది. ప్రజలు అధర్మాలూ, అవినీతులు అనేవి చాలావాళ్లకి ఏపనులు చెయ్యడానికి ధైర్యం లేదో అవి ఐ వుంటాయి. వాటిని సమర్థించుకోడానికి శాస్త్రాలని సాక్ష్యం తెచ్చుకుంటారు. తమకి ఇష్టమైనవి శాస్త్రాలు నిషేధించినా చెయ్యడం మానరు. తమకిచెయ్యడానికి ధైర్యం లే పీ ఇష్టంలేనివీ మాని ఆ నెపం శాస్త్రాలమీదో పెద్దలమీదో తోస్తారు, కొంచెం సాధన కలవాళ్లు ప్రపంచమేమన్నా సరే తాము తప్పనుకున్నవి వొదిలే ధైర్యం కలిగి వుంటారు కాని తాము మంచిదనుకున్నవీ నియమాలనుకున్నవీకూడా అతిక్రమించేసాహసం Disintersetedness చాలాకొద్దిమందికే వుంటుంది ప్రేమకోసం అవసరమైతే దొంగతనం హత్య నీచమైనపనులు చేయడానికి సంసిద్ధులు కావాలి. అంతధీరత్వం రావాలి-

## 16

ఎన్ని వ్యాసాలు ఎవరు యెంత ఆకర్షవంతంగా వ్రాయనీ. ఏ డిక్టేటరో వివాహమనేది వుండకూడదని శాసించనీ, ప్రజలు జతకావడంమానరు భర్తలనించి లేచిపొయ్యే వాళ్ళుకూడా, ఏ మూలనో కొంచెం విశ్వాసం కలవాళ్ళతో యెవరితోనే స్థిరపడతారు. నేను వాంఛించే మార్పు యీ వివాహంలోవున్న అక్రమాలు అన్యాయాలు పోవాలని. ఈ దుర్మార్గాలు వొదిలించినంత మాత్రాన అసలు చచ్చేటంత దుర్భరం కాదు వివాహం. అంతే కాకుండా వివాహం వొద్దన్న వాళ్ళకి బలవంతంగా కట్టకూడదనీ, వివాహం అయినంత మాత్రాన సర్వమూ నీతిగా తలవడమూ, కానంత మాత్రాన అవినీతి అనడమూమూర్ఖమనీ నా వాదన! ఇట్లాంటివి బోధిస్తే యీ ప్రజలకి కోపమెందుకంటే - వాళ్ళ హృదయాలు విప్పి చూపగల యంత్రమో మంత్రమో వుంటే అర్థమవుతుంది - పురుషులకి స్త్రీమీద తమకి చలామణి అవుతున్న హక్కులు పోతాయి అనీ, స్త్రీకి పురు

షలు పెడుతోవుంటే సుఖంగా బద్ధకంగా బతికే భాగ్యం పోదులుకోవలసి వస్తుందనీ భయం. అందరికీ మరీ కోపం యీ నా దుష్ప్రచారానికి, కళా, ఆకర్షణా తోడ్పడి, వాళ్ళు మింగకూడదనుకున్న మాత్రల్ని, చక్కగా చప్పరించి రక్తంలో కెక్కేట్టు చేస్తున్నాయని.

## 17

ఇదంతా **vested interests** చేసే మామూలు **propaganda.** నేను బోధించే స్వాతంత్ర్యం తనకి కావాలనే వుంటుంది పురుషుడికి, స్త్రీకి. తన స్త్రీలకీ తక్కిన పురుషులకీ కూడా యీ స్వాతంత్ర్యం వస్తుందేమోనని ఎవడికి వాడికి బెంగ. కారణం లోకం పాడవుతుంది అని చెప్పుకుని సమర్థించుకుంటారు. వాళ్ళ మనస్సుల్లో తరతరాలనించి నాటివున్న నీతి అభిప్రాయాలు మార్పుని అంగీకరించవు. ప్రేమలో యీ బలవంతమూ మామూలు అనే రెండుపోతే యెన్ని నూతనసుందర లోకద్వారాలు వాళ్ళ కళ్ళముందు తెరుచుకుంటాయో కలలోనన్నా తెలుసుకోలేరు. వాళ్ళిప్పుడున్న స్థితిలో, ఈ ప్రజలు. వాళ్ళందరికీ నిర్బంధ వివాహం అవసరం. నిర్బంధం లేకపోతే యీమాత్రం స్త్రీ సౌఖ్యం దొరకదని భయం వీళ్లకి. వీళ్ళకీ విజ్ఞానం యివ్వడం వీళ్ళ మనసుల్ని మార్చడం, మనుష్య ప్రయత్నానికి సాధ్యమయ్యే పని కాదు. ఎప్పుడో యెట్టాగో, యే జన్మలోనో, యే లోకంలోనో వారికి ఆత్మలనేవి వుంటే **mysterious** గా, యీ పువ్వుల్ని వికసింపచేసే కాంతివలెనే, క్రమంగా వాళ్ళ కళ్ళని విప్పుతుంది యీ విశ్వప్రేమ. ఏభయంకర ఘాతాలవల్లనో, యే ప్రేమ వృష్టివల్లనో. ఒక్కసారి నూతనలోకంలో ప్రవేశిస్తారు. అందాకా నావంటివారు, యేనాటికి అవసరమవుతుందో, ఏ వ్యక్తి అభిలషించి వెతుక్కుంటుందోనని ఈ విజ్ఞానాన్ని వెదచల్లి వుంచాలి. దీనివల్ల తృప్తినీ, సుఖాన్ని, కాంతినీ పొందుతున్న మిత్రులున్నారని నాకు తెలుసు. నాకు మనుష్య హృదయం మీదవున్న విశ్వాసంవల్ల యిట్లా పాడగా పాడగా, మేల్కొంటుందనే భగ్నం కాని ఆశతో వ్రాస్తూ వుంటాను, ఈ అశాంతి. యీ వ్యభిచారం, కామోద్రేకం, యీ స్వల్ప వాంఛలు, శాశ్వతమైనవి కావనీ, యింతకన్న జీవితాల్ని వున్నతంగా ఆకర్షించి తృప్తినిచ్చే మహాశక్తి ప్రతివారికోరకూ జన్మహక్కై వేచివుందనీ, విశ్వసించబట్టే వీళ్ళు కల్పించుకున్న కాపరాలూ, వివాహాలూ, చట్టాలూ బంధాలూ అన్నీ మేఘాల వలే చెదరి పోయి, ప్రేమ భాస్కరోదయ మవుతుందని నాకు రూఢి కాబట్టే, నేను ఇంతకాలాన్నీ శక్తినీ, మర్యాదనూ, సౌఖ్యాన్నీ వినియోగించి **persistant** గా వ్రాయగల్గుతున్నాను.

నిర్భాగ్యులైన ప్రస్తుత స్త్రీలలో వారి క్షుద్రత్వంలో బానిసత్వంలోనే, దేవత్వాన్ని, అధికత్వాన్ని చూసి ప్రకటించదలచిన నా faith in woman-hood ని వక్రం చేసి స్త్రీ పాతివ్రత్యాన్ని, శీలాన్ని modesty ని ధ్వంసం చెయ్యాలని చూస్తున్నానని సాగించే దుష్ప్రచారం అసాధారణం కాదు లోకచరిత్ర చూస్తే నిజంగా శీలాలూ. ఆత్మనిర్మలత్వాలూ, ధర్మాలూ పాడైపోతూ వుంటే భార్యలు, కూతుళ్ళూ. తమ ఇష్టాలకి ఎదురు తిరిగి వేషాలూ భాషలూ ఆచారాలూ. నీతులూ. మీరుతోవుంటే, ఏమీ అనలేరువాళ్లని-వాళ్లు లేకుండా గడవదు. ఏమన్నా గట్టిగా అంటే స్త్రీలు వీధిని పడుతున్నారు. అందుకని ఆ కోపాన్నీ, ఉక్రోషాన్నీ అసహాయత్వాన్నీ, స్త్రీల స్వతంత్రతని సమర్థించే వ్యాసాలమీద చిమ్ముతారు.

## 18

పొలం దున్నడంగాని, చాపలు మొయ్యడంగాని నిజంగా అంతా దుస్సహమైన కార్యమేనా? కాదు. ఆబాధ అంతా చూసే నా కళ్ళలోనే, వ్రాసే నా కలంలోనే ఇతరులకి లేని బాధలు వున్నాయనుకోడం ధర్మాత్ముల డ్యూటీ. కవికీ, కథకుడికీ, అత్యవసరం - అతని జీవనాధారం; అతిశయోక్తి లేంది వాఙ్మయమే లేదు. ప్రస్తుతం కవులు వ్రాసే కార్మిక కర్షక రచనలు మూడుసార్లు misplaced sentiment, నా నరాలు ఆ పల్లెవాడి నరాలు కావు, అతనిని యింత సుకుమారాలు కావు- ఎండలో దున్నే కర్షకుడి చమటలు తలుచుకుని నడుము వొంగని కవి సరదాగా వరండాలో చాపమీద కూచుని, తనకే సంభవిస్తే ఆపని యెంత బాధకరంగా వుంటుందో యోచించుకుని, కవిత్వ మల్లుతాడు, తాను కూర్చున్నందుకు చాపకెంతబాధో అని కథలు వ్రాయవచ్చు, ఆచాప రోదనం ప్రపంచానికి వినిపించవచ్చు, ఆచాప లోకపారిశుధ్య ఆశయం, ఆచాప తనలోపల పెట్టుకుని అవతరించిన దేవత అనవచ్చు, స్త్రీ విషయమై నేనువ్రాసేకథలూ అంతేనేమో! కళకూడా fashions ని అనుసరించి నడుస్తోంది, స్త్రీలని subject గా తీసుకుని కథలు వ్రాయడం చాలా సన్నుత కార్యమై పోయింది ప్రస్తుతం,

## 19

ఒక్కొక్క గుణం ఆదర్శంగా చూపగల పాత్రల్ని సృష్టించాను, నూతన నీతి ఆదర్శాలని, పాతివ్రత్యాన్ని కిరాతులనించి, వేషాలేసుకున్న దేవతలనించి, పవిత్రులైన రుషులనించి, లేక రౌడీలనించి, జమీందారులనించి, పోలీసులనించి, దుర్మార్గుడైన భర్తమీద భక్తి వల్ల, భద్రంగా దాచిపెట్టుకుందని మామూలు రకంగా వ్రాస్తేనేగాని మీకు

ఆదర్శం కనబడుతుందా? త్యాగం క్రింద తన శీలాన్ని అర్పించిందని వ్రాయగల దారు ఢ్యం పూర్వకవులకి వుండేది ఈనాటి నిస్సత్తువ నీతికళేబరాలకి కలంముందుకి నడవదు. నేను స్త్రీలచేత చేయించిన ధీరకార్యాలన్నీ లోకానికి పాపాలుగా కనబడుతాయికదా! ఎట్లా ఆదర్శాలు కల్పించగలను మీకు నచ్చేట్టు! తన ప్రేమకోసం, భర్తనీ పిల్లల్ని, కులాన్ని, గౌరవాన్ని వొదిలిన స్త్రీ ఆదర్శవ్యక్తి అంటాను నేను.

## 20

Style! Style! Style ని పొగిడి style ని ప్రోత్సహించే నాబాదని, నాబాధ వెనుక మండుతో యీ సిరాలోంచి మీ హృదయాలలోకి పలకాలని చూసే మూగకంఠాల క్షోభ వినపడకపోతే, మూలమూలల అణిగి నలిగి నశించే దీర వనితల ఆర్చత్వం మీకు తట్టకపోతే నేను వ్రాసి యేం లాభం, మీరు చదివి యేం లాభం?

Style, beauty art — ఎందుకివ్వన్నీ! దొంగ విమర్శకులకి నీతివర్తనులనీ, ఆధ్యాత్మిక ప్రేమవేత్తలనీ, ఉన్నత ఆత్మరసికావతంసులనీ కీర్తినివ్వడానికి తప్ప!

Romain Rolland వ్రాస్తున్నాడు.

Write it simple, as simple as it's unfolding. Waste no thought upon the Word and the letter, and thc subtle vain researches in what the force of the artists to-day is turned to nought. You are addressing all men: use the language of all men. There are no words noble or vulgur: there is no style chaste or impure: there are only words and styles which say exactly what they have to say, Be sound and thorough in all you do, think just what you think- and feel just what you feel. Let the rythm of your heart prevail in your writings. The style is the soul,

చాలా సులభంగా, ('సింపుల్'గా) ఎట్లా వెలువడితే అట్లా 'సింపుల్'గా వ్రాయి. మాటమీద మనసుని వృధా చేసుకోకు. అక్షరంపైన ఆలోచన నిలుపకు. ఈనాటి కవుల శక్తి న జూకైనశబ్దాల, అర్థంలేని మెలికల్లో, వెతుకుళ్ళలో, మెరుగుల్లో ఇంకిపోతుంది. ప్రజలందరూ చదవడానికి వ్రాస్తున్నావు, ప్రజలందరూ మాట్లాడే భాషని వ్రాయి. గొప్ప మాటలనీ! నీచపుమాటలనీ, నిర్దుష్టమైనశైలి అనీ, మలినమైనదనీ, రెండులేవు, చెప్పేదేదోసూటిగా స్పష్టంగా, చెప్పగల మాటా, శైలీ ఇవే వున్నాయి. చెప్పేది దిట్టంగా సంపూర్ణంగా తెలిసేట్టు చెప్పెయ్యి. ఏదిఆలోచిస్తున్నావో అదిసరిగా నిజంగా ఆలోచించు. నిజంగా నువ్వు దేన్ని అనుభవించావో అది నిజంగా అనుభవించు. నీ హృదయంలోని లయ (రిదం)నే వ్రాతల్లో కనపడనీ. ఆత్మే శైలి.

## 21

సుబ్బారావుగారు తెలుసుకోనిదేమటంటే, తాను పాటరాసినా, ప్రథమంనించి ఆపాట మామూలు శృంగారపు గీతంకాదు- వాటికి ఓ ఆత్మ వైశాల్యం, ఓ గంధర్వ విలాసం పట్టింది. అందువల్లనే పాత ప్రజా వాంగ్మయంలోని పల్లెపాటలకి లేని ఆధి కృత ఎంకిపాటలకి పట్టింది. ఎంకి మొదటినించీ ఈ ప్రపంచాన్ని మించిన శృంగార వీధుల్లోనే విహరించింది. మీరిప్పుడామెని వేరేసమర్ధించ-నఖ్కర్లేదు సహృదయులు రసి కులు ఎప్పుడూ ఎంకిని దేవతగానే చూశారు. ప్రజా బాహుళ్యాన్ని కూడా వొప్పించాలనే మీప్రయత్నం కొనసాగేది కాదు. ఎంకిని కాశీ పంపించి ప్రాయశ్చిత్తం చేయించినా, గంగలో వీపుతోమించి శృంగారాన్నంతా కడిగినా, ఆమె పాత చరిత్రను మరువదు యీఅల్లరి తెలుగుదేశం.

ఎప్పుడూ ఎంకి ప్రజల మనిషికాదు తన శృంగారంవల్లనే ఓ aristocracyని పుటకతోనే తెచ్చుకుంది. ప్రజల మన్ననలకి ఎన్నడూ ఆశించలేదు ఆమె. ఎవర్ని ఎంకి ఎడంకాలితో తన్నిందో, వారి మన్ననలకి తల వాగిస్తున్నారామెనీ నాడు.

సుబ్బారావుగారి పాటల్లో వుండే ఆధికృతని, అసలు అందాన్ని తెలుగుదేశం గ్రహించనేలేదు. అతన్ని మెచ్చుకుని వెనుకేసుకుని వొచ్చిన వాళ్ళుకూడా ఆపాటలకి తగిన ఆదరణా రాలేదు. పండితుడికి తుచ్ఛ శృంగారమూ బూతూ అయినాయి.పామరు లకి వాటిల్లో నాజూకు శృంగారం అందుబాటులోకి రాలేదు. అసలు వాటిల్లోని శృంగార చ్ఛాయలు వీరికీ వారికీ కూడా అనుభవ వేద్యం కావు. పల్లెపాటల్ని పాడుకుంటారు. కాళిదాసుని మెచ్చుకుంటారు. ఎంకిపాటల్ని నిరసిస్తారు. అది ప్రజా వాంగ్మయం కింద ప్రజలు తీసుకోలేదు. సాహిత్యం కింద పండితులు తీసుకోలేదు. వార్షికోత్సవాలలో ఓ light ప్రోగ్రాంకిందనే కాని, lecture halls లోకి ప్రవేశార్హతలేదు.ఓవంద మంచి హృదయాల్లోకి ఆ పాటల్ని తీసుకునేటప్పటికే పొంగిపోయినారు కవి. కావి ఆ వంద మంది అయినా ఎంతగాఢంగా తీసుకున్నారు తెలుగు దేశానికి వొచ్చిన లోపమే అది ఏకళనీ ఈ ప్రజ seriousగా తీసుకోదు. ఎంకికన్న ఇంక ప్రపంచంలో ఏముంది అని మూర్ఛలుబోయిన మిత్రులు రైలెక్కి-లోపల మరిచిపోయి న్యూసుపేపరు చర్చిస్తారు. పట్టుమని ఓపదిమంది యువతులు గాని యువకులుగాని తన్మయులై సుబ్బారావుగారి పాదాక్రాంతులు కాలేదు. ఏ ఇద్దరి ప్రణయానికి మెరుగులు పెట్టలేదు. అది ఆంధ్రుల హృదయపు దివాలాతనానికి ఉదాహరణం.

సుబ్బారావు సమకాలికులైన కవులు కొందరు దేశంపైన ఎగబడి "మమ్మల్ని కవులుగా ఒప్పుకుంటారా, మిమ్మల్ని తన్నమా!" అన్నారు.

కొందరు "మమ్మల్ని కవులుగా వొప్పుకోకపోతే మీఇంట్లో చిరకాల అతిథులుగా వుంటామని బెదరించారు. కొందరు అంకితాలిచ్చారు. సేవచేశారు. చలం కొట్టిన దెబ్బల గుర్తుగాని దేశానికి, చలం పాడిన పాటలుకావు.

ఇవేమీ చెయ్యని సుబ్బారావుని దేశం serious గా తీసుకోలేదు. కాని ఎంకి గొప్పకవితా శక్తితో పుట్టింది. ఎంత కాదని తోసేసినా, వొదలకుండా విప్లవం సాగించింది. అయితే ఏంలాభం ముందు సాహిత్యాన్ని ఒకముఖ్యమైన విషయంగా తీసుకొని తెలుగు ప్రజ ఎంకినిగుర్తించగలరా? సుబ్బారావులో ఎంత economy of words. కవిత్వమన్నా వ్యర్థపదం లేకుండా రాయవొచ్చు. కాని దరువూ, రాగంలో బిగిసినపాటల్లో ఆ economy maintain చెయ్యడం చాలా అపురూపమైన శక్తి" అన్నారు ఈశ్వరుడు.

'ప్రతి పదం వెనకాధ్వని' అన్నాను.

"అలక్షణం ఒక్క వేదసూత్రాలకే సంపూర్ణంగా వుంది" అన్నారు ఈశ్వరుడు. "ఆ భాషల వల్ల ఈప్రజల మనసుల్లో తేలికైనాయి అంత అనన్యసాధ్యమైన పాటలు అన్నాను. "పొరపాటు ఆభాషవల్లనే వొచ్చింది ఆఅందమూ ఆబిగువు" అంత సులభమైన మాటలల్లో ఆశక్తిని పొయ్యడమూ, ఆ economy చూపడమూ, ఎక్కడో ఎప్పుడో వుడతాడు అట్లాంటి కవి. ఒక్క శ్రీశ్రీలోవుంది ఆ economy కొంతవరకు అట్లాంటి సహజమైన కవిత్వాన్ని తోటల్లోంచీ పొలాల్లోంచీ తీసుకుపోయి మందిరాల్లో ఉద్యాన వనాల్లో పెట్టాలనిచూశాను.

"కాదు దేవాలయాల్లోనూ, ఆశ్రమాల్లోనూ అన్నాను.

"అవును వాళ్ళకి పూజలు పొలాల్లోనే ఐనాయి. ప్రకృతే దీవించింది వారిని. వేరే గౌరవం ఎందుకు" అన్నాను.

"తనహృదయంతో అంతఆనందాన్నిస్తో అంత పవిత్రంగా పలికిన ఆ శృంగార కవితా-ఝురి లోకంలోకి ప్రవేశించి, మలిన హృదయాన్ని కడిగిన మురికితో, నీచంగా కనపడేప్పటికి,ఆకంపుని భరించలేక నాయకీ నాయకుల్ని పునీతుల్ని చెయ్యాలని ప్రయత్నిస్తున్నారు సుబ్బారావుగారు" అన్నాను.

ఏభాషలోంచి ఒక్క ఉపమానమైనా ఎరువు తెచ్చుకోకుండా, స్వంతదారులు తీసుకొని కల్పించారు ఆనూతన కవిత్వాన్ని, ఆప్రతిభావంతుడు.

## 24

నారాత ఏశ్రుతులు, అపశ్రుతులు పలకనీ - అది నేను; నారక్తం; నా గడచిన జీవితపు ఛాయ.






తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

Cover Printed at Vistas Printers